210

శ్రీ పరమేశ్వరాయనమః

దివ్యవాణీ సుకృతిప్రాసాదము. 9 వ సుకృతి.

# షోడశ సంస్కారములు

వివాహితము 210

రచయిత:

## చిత్రకుల అప్పయ్యశాస్త్రి




ప్రకాశకులు:

## దివ్యవాణీ సుకృతి ప్రాసాదము,



 వెల: 0-12-0

ఈ షోడశ సంస్కారములు, అనెడి యీ గ్రంథము శ్రీ దివ్యవాణీసుకృతి ప్రాసాదమునందు తొమ్మిదవ సుకృతిగా ప్రకటింపబడినది. ఇద్దానికి సంస్కృతాంగ్ల హిందీభాషావిశారదులును, సనాతనధర్మోద్ధారకులును, శతాధిక ధార్మికగ్రంథ ప్రణేతలునగు శ్రీ శ్రీ స్వామి దయానందులవారి ధర్మకల్పక ద్రుమములోని కొంతభాగమై యున్నందువలన శ్రీవారి కనేక కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాడను. ఇందలి మంచి చెడ్డలు వివేకపాఠకలోకమే యెఱుగజాలియున్నది. కాని యథార్థ తత్త్వమునుగోరు ప్రతిమనుష్యుడును దాఁజేయు నామకరణ ఉపనయన వివాహాది సంస్కారముల లాభ నష్టములను తెలిసికొన వలసినవిధి యుండుటంబట్టి యాకృత్యమున కిది కొంత వరకైనను మంచి సహాయకారి కాగలదని విన్నవింప గలను

21-5-45
శికింద్రాబాద్

చివుకుల అప్పయ్యశాస్త్రి
సంపాదకుడు.



# విషయ సూచిక

శ్రీ పరమేశ్వరాయనమః

శ్రీ

# షోడశసంస్కారమహిమ

## షోడశ సంస్కార మహిమయన నేమి?

వేదశాస్త్రములచేఁ జెప్పఁబడిన పదునాఱు సంస్కారముల (కర్మముల) యొక్క గొప్పతనము, షోడశ సంస్కార మహిమ యని చెప్పఁబడును. ఈ పదునాఱు సంస్కారము లేవో వానిమహిమయెట్టిదో తెలిసికొనుట యీకర్మభూమియం దవతరించిన మనకు విధియై యున్నది. వర్ణాశ్రమ ధర్మీయులు షోడశ కర్మములను దొలుతనుండి నేఁటివరకు నాచరించు చున్నారు. కాని చాలమంది కవి యెందులకు జేయఁబడు చున్నవో వానివలనఁ గలుగు లాభములేవో, యవి యాచరిం పనియెడల వచ్చు నష్టములేవో, మున్నగు విషయములు చాల వరకు దెలిసియుండవు. అందువలన నిద్దానింగూర్చి కొంత వ్రాయఁ బ్రయత్నించుతును. పాఠకులు శ్రద్ధాళువులై పఠించి సత్యాసత్యములను బరిశీలించి ధర్మ ప్రచారమునకుఁ దోడ్పడి ధన్యులగుటకుఁ బ్రార్థించుచుఁ బ్రకృతమునకు వచ్చుచున్న వాఁడను.

## ఆకస్మికత (Chance)

ప్రపంచమం దొక్కొక్కప్పుడు కారణములేకయే యొక గొప్పపని సిద్ధించుటయో, యొకలాభము గల్గుటయో యొకనష్టము వచ్చుటయో, ప్రతిమానవునకును దెలియుచున్న విషయమే. ఇట్లకస్మాత్తుగాఁ గలిగిన దానినే యాకస్మికమని యందురు. ఈ ఆకస్మికతనే హూణభాషలో "ఛాన్సు" (Chance) అని వ్యవహరింతురు. ఛాన్స్ అనఁగా నకారణముగాఁ గలుగునదని యర్థము. ఈ "ఛాన్సు" పదమునుగూర్చి పాశ్చాత్య విద్వచ్ఛిరోమణి హెర్బర్టు స్పెన్సర్ గారిట్లు తమ "ది ప్రిన్సిపల్సు ఆఫ్ సైన్స్" గ్రంథమున 198 వ పుటయందు వ్రాసియున్నారు:—

"Chance cannot be the subject of the theory, because there is really no such thing as chance regarded as producing and governing events. The word chance signifies falling (Latin cado to fall.) Chance then exists not in nature and cannot co-exist with knowledge; it is merely an expression as Laplace remarked, for our ignorance of the causes in action and our consequent inability to predict the result or to bring it about infallibly. In nature the happening of an event has been predetermined from the frist fashioning of the universe.,,

The Principals of Science P. 198.)

"ఆకస్మికత" (ఛాన్స్) యనునది విచారింపవలసిన విషయమే కాఁజాలదు. ఎందులకనఁగా, ఏపనియొక్క యుత్పత్తికిఁగాని సంచలనమునకుఁగాని మూలమందు "ఆకస్మికత" యనుదాని కెట్టి తావును లేదు. లాటిన్ భాష ననుసరించి ఛాన్స్ లేక "ఆకస్మికత" శబ్దమునకు "పతన" మని యర్థము. (పతన మనఁగా "పడుట")

ప్రకృతి రాజ్యమునందు "ఛాన్సు" అనునదియే లేదు. జ్ఞానము, "ఛాన్సు" ఈ రెండును గలిసి యొకచోటగూడ నుండఁజాలవు. లైఫ్ వెస్ దొరగారు వచించిన ట్లెప్పుడు మనమే కార్యమునకేని కారణమును దెలిసికోనఁజాలకుందుమో యాదుచేతనే దానియొక్క ఫల విషయమునందుఁగూడ ననుమానింపకుందుమో యప్పుడే "ఛాన్స్" (అకస్మికత) శబ్దము ప్రయోగింపఁబడు చుండును. ప్రపంచ రచనయొక్క ప్రారంభము నుండియే ప్రకృతిరాజ్యమందలి ఘటనను ఘటించెడిదాని కారణము నిర్దిష్టింపఁబడియున్నది. ఆర్య సిద్ధాంతముగూడ సరిగా నిదియే. అకారణముగా నేకార్యముగూడ జరుగనేరదని మనము నమ్ముచున్నారము ఉత్తమ కారణమును గైకొనినప్పు డత్యుత్తమకార్యము సిద్ధించును. మీదుమిక్కిలి ఇది సర్వవిధములను సిద్ధాంతీకరించుటకు సంసిద్ధులమై యున్నాము. ప్రపంచమందు శిల్పకళయొక్క సాహాయ్యముతో విలువగల గొప్పగొప్ప పెక్కురకముల సామగ్రిలను భిన్నభిన్న జాతులవారు సిద్ధపరచునట్లు వేదశాస్త్రములందు జెప్పఁబడిన



ప్రక్రియలద్వారా మనుష్యులను బూర్ణులుగను, నుత్తములుగను నైశ్వర్యవంతులుగను నొనర్చు నధికార మార్యశాస్త్రమునకు గలదు. ఇట్టి యధికారములు పెక్కు గలవు. వానిలో నొకటి యిది. దీనినామము షోడశ సంస్కారము.

ఆర్యశాస్త్రములందు సంస్కారములకు గొప్ప మహిమ చూపఁబడియున్నది. షోడశకళా సంపూర్ణుఁడగు చందమామ పూర్ణతతో సమానముగా షోడశ సంస్కారములద్వారా పూర్ణత్వలాభమును బొంది జీవుఁడు జీవత్వమును విడిచి బ్రహ్మత్వ పదము నధిష్ఠించెడి భాగ్యమును బొందఁగలఁడు. శాస్త్ర మిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ “చిత్రం క్రమాద్యథానేకై, రంగైరున్మీల్యతే శనైః
బ్రాహ్మణ్యమపితద్వత్స్యా, త్సంస్కారైర్విధిపూర్వకైః

లేఖిని (కలము) మాటిమాటి కట్లిట్లు త్రిప్పఁబడుటవలన జిత్రము (చిత్తరువు) సర్వాంగములతో సంపూర్ణమైనట్లు విధిపూర్వకములగు సంస్కారముల యనుష్ఠానమువలన బ్రాహ్మణ గుణములు వికసింపఁగలవు. మను భగవానుడు రెండవ యధ్యాయమున నిట్లు నుడువుచున్నాఁడు.

“వైదికైః కర్మభిః పుణ్యై, ర్నిషేకాది ర్ద్విజన్మనాం
కార్య శ్శరీర సంస్కారః, పావనః ప్రేత్య చేహచ॥

గార్భైర్హోమై ర్జాతకర్మ, చౌడమౌంజీ నిబంధనైః
బైజికం గార్భికం చైనో, ద్విజానా మపమృజ్యతే॥



స్వాధ్యాయేన వ్రతై ర్హోమై స్త్రైవిద్యే నేజ్యయా సుతైః
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ, బ్రాహ్మీయం క్రియతే తనుః॥

ఇహలోకమందును బరలోకమందును సుఖమును గల్గించెడివియు, వేదమునందుఁ జెప్పఁబడినవియు నగు గర్భాధానము మొదలగు పుణ్యకర్మములద్వారా ద్విజన్ములకు శరీరసంస్కారము గావింపఁ దగినది. గర్భసమయమందు జరిపెడి మూఁడు సంస్కారములందును, జాతకర్మ, చూడాకర్మ, ఉపనయనాది సంస్కారములందును గావించెడి, హోమములవలన బీజమందుండెడిదోషము, గర్భవాసము జేసినందువలనఁ గలిగిన యపవిత్రతయు నశించుచున్నది. మఱియు వేదమంత్రములయొక్క ప్రభావమున నంతఃకరణమందు శుభ సంస్కారోదయము గలుగుచున్నది. వేదారంభ సంస్కారములద్వారా కల్గిన వేదస్వాధ్యాయమువలనను, వ్రతములవలనను, హోమములవలనను, త్రైవిద్యాజ్ఞానమువలనను, యోగానుష్ఠానమువలనను, వివాహ సంస్కారముద్వారా యబ్బెడి సంతానోత్పత్తి వలనను, పంచమహాయజ్ఞమువలనను, అగ్నిష్టోమాది యజ్ఞమువలనను, ద్విజులశరీరము బ్రహ్మపదమును బొందుటకు యోగ్యమైనది గాఁగలదు. ఈ రీతిగా వేదచోదిత సంస్కార ఫలములు సాధారణముగా మనుప్రభృతి స్మృతికర్తలచేఁ జూపబడినవి. ఇఁక నీ సంస్కారములకే వేలువేలుగాఁగూడ ఫలములను స్మృతి శాస్త్రకర్తలు విశేషించి వచించియున్నారు. ఎట్లన?

"నిషేకా ద్బైజికం చైనో, గార్భికం చాపమృజ్యతే
క్షేత్ర సంస్కారసిద్ధిశ్చ, గర్భాదానఫలం స్మృతం॥

గర్భా ద్భవేచ్చ పుంసూతేః, పుంస్త్వస్య ప్రతిపాదనం
నిషేకఫలవత్ జ్ఞేయం, ఫలం సీమంతకర్మణః"॥

గర్భాంబుపానజో దోషో, జాతా త్సర్వోపినశ్యతి
ఆయు ర్వర్చోభివృద్ధిశ్చ, సిద్ధి ర్వ్యవహృతే స్తథా॥

నామకర్మఫలం త్వేతత్, సముద్దిష్టం మనీషిభిః
సూర్యావలోకనా దాయు రభివృద్ధి ర్భవే ద్ధ్రువా॥

నిష్క్రమా దాయు శ్శ్రీ ర్వృద్ధి, ర ప్యుద్దిష్టా మనీషిభిః
అన్నాశనా న్మాతృగర్భ మలాశా దపి శుద్ధ్యతి॥

బలాయు ర్వర్చో వృద్ధిశ్చ, చూడాకర్మఫలం స్మృతం
ఉపనీతేః ఫలం త్వేత, ద్ద్విజతా సిద్ధిపూర్వకా॥

వేదాధీత్యధికారస్య, సిద్ధిః ఋషిభి రీరితా
పత్న్యా సహాగ్నిహోత్రాది తస్య స్వర్గః ఫలంస్మృతం॥

బ్రాహ్మ్య ద్యుద్వాహసంభూతః పితౄణాం తారకస్సుతః
వివాహస్య ఫల త్వేత, ద్వ్యాఖ్యాతం పరమర్షిభిః॥"

గర్భాదాన సంస్కారమువలన, బీజమందలి దోషము, గర్భము
నకు సంబంధించిన సమస్త మాలిన్యములును రూపుమాయు
చున్నవి. వెండియు క్షేత్రరూపయగు స్త్రీ సంస్కారముగూడ
దీనికి ఫలమగుచున్నది. గర్భము ధరించినపిమ్మట కన్యాశరీర

మేర్పడకుండ పుత్రశరీర మేర్పడుట కై పుంసవన సంస్కారము చేయఁబడును. పుంసవన ఫలమే పుత్రోదయము సీమంతఫలము గర్భాదాన సంస్కారమునకుఁ జెప్పఁబడిన ఫలమే. జాత కర్మమువలన గర్భమునందుండి తల్లి యాహార రసమును గ్రోలుటవలనఁ గలిగిన యెల్ల దోషములు నష్టములగును. నామ కరణ సంస్కారమువలన, ఆయుర్వృద్ధి, తేజోవృద్ధి, ప్రపంచ మందు నామ వ్యవహార సిద్ధియు గలుగును. నిష్క్రమణ సంస్కారమునందు మంత్రపూర్వకముగా సూర్యనారాయణ మూర్తి దర్శనము చేయుటచే ఆయుశ్శ్రీ వృద్ధులు సిద్ధించును. అన్నప్రాశన సంస్కారమువలన మాతృగర్భమందలి మాలిన్య మును భక్షించుటచే వచ్చిన దోషము నిర్మూలమగును. చూడా కర్మ సంస్కారమువలన, బలము, ఆయువు, తేజము వృద్ధి యగును. ఉపనయన సంస్కారమువలన ద్విజత్వము సిద్ధించి వేదాధ్యయనాధికారము గలుగును వివాహమైనపిమ్మట పత్నీ సహితముగా నగ్నిహోత్రాదుల ననుష్ఠించుటవలన స్వర్గ లాభము సంభవించును. మఱియు బ్రాహ్మాద్యుత్తమ వివాహ సంస్కారమువలన సుపుత్రులు పుట్టి పితురులకు సంతుష్టి కలిగింతురు. ఇదియే వివాహసంస్కార ఫలము. ఆర్య శాస్త్రములందీ రీతిగా సంస్కారములయొక్క గొప్ప మహిమ జూపఁబడి యున్నది.

ఈ సంస్కారములవలనఁ గలిగెడి ఫలముల నన్నింటిని బ్రధానముగా మూడు భాగములుగా విభజింపఁ దగియున్నవి.

ఎట్లన? (1) దోషమార్జనములు (2) అ తి శ యా ధా న ము (3) హీనాంగపూర్తి. కల్మష ప్రకృతిగల యే పదార్థమునైనను సంస్కరించుట కీ మూడుపాయములు అవసరములగును. ఇందులకు దృష్టాంత మేమన, గనిలోనుండి తీయఁబడిన లోహము మిక్కిలి మలినముతోఁ గూడియుండును. ఆ లోహముతో నొక కత్తిని జేయవలయునని తలఁచినయెడల మున్ముందా లోహము నకు "దోషమార్జనము" చేయవలసి యుండును. (అనఁగా దానికున్న మలినమంతయుఁ బోగొట్టి శుభ్రపరచవలసి యుండును.) తరువాత నా లోహమును నగ్నియందుఁ దగినట్లు కాల్చి కడ్డీగాఁజేసి పిమ్మట కత్తిరూపుగా సిద్ధము జేయ వలయును. దీనికే "అతిశయాధానము" అని పేరు. ఈ ప్రకారముగా సిద్ధము జేయఁబడిన యనంతరము కఱ్ఱతోనో, వెండితోనో లేక బంగారముతోనో ఆ కత్తికొక "పిడి"ని గూర్చుటయో, దానిని సింగారించుటయో "హీనాంగపూర్తి" యని వ్యవహరింతురు. ఇట్లే ప్రత్తిచెట్టు వలన వచ్చిన కాయలను దొలుత దానిని గప్పియున్న మలినము దొలిసివేసి యందలి ప్రత్తిని గొని శుభ్రపరచుట "దోషమార్జన"మనియు, దానినుండి దారము, దానినుండి దోవతి, ఉత్తరీయము, చొక్కా మున్నగువానిని సేయుట "అతిశయాధాన" మనియు, ఆ చొక్కా మున్నగువానికి గుండీ లోనగునవి గూర్చి మనము ధరించుటకుఁ దగినట్లు జేయుట హీనాంగపూర్తి యనియుఁ జెప్పెదరు,

ఇ దృష్టాంతములనుబట్టి సంస్కార విషయములందుఁ
ర్భాదానము, జాతకర్మ, అన్నప్రాశనము మున్నగు
ములవలన "దోషమార్జనమును, చూడాకర్మము,
ము లోనగు సంస్కారముల ద్వారా "అతిశయా
ము, వివాహము, అగ్న్యాధానము మొదలగు
ముల మూలమున హీనాంగపూర్తియు నగుచున్నదని
వలయును. ఈ ప్రకారముగా సంస్కారములందలి
ద్వారా జీవుఁడు శివత్వముఁ బొందుటకుఁగూడ దగిన
ఁగలడు.

సంస్కార కార్యమునం దధికార మెవనికిఁగలదు? (*-
ఈ ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరముగా యాజ్ఞవల్క్య
యిట్లు వ్రాయుచున్నాఁడు.

బ్రహ్మ క్షత్రియ విట్శూద్రాః
ర్ణాస్త్వాద్యాస్త్రయో ద్విజాః
షేకాది శ్మశానాన్తా,
స్తేషాం వైమంత్రితః క్రియాః॥

ర్ణములోని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులనెడి మూఁడు
వారు ద్విజులని వచింపఁబడుదురు వీరికి గర్భాదానము
శానాంతమువఱకుఁ గల సంస్కారములు వైదికవిధి
ముగా సమంత్రకముగా జరుపబడును. శూద్రుల కా
రములన్నియు నమంత్రకముగా జరుగును. యమ
యందిట్లు చెప్పఁబడినది.

"శూద్రోఽప్యేవం విధః కార్యో
వినా మంత్రేణ సంస్కృతః॥

శూద్రులకుఁగూడ నీ సంస్కారములన్నియు వేదమంత్రములు లేకుండ జరిపింపవలయును. వీరికి వేదాధికారము లేనందువలన నుపనయన సంస్కారమొకటి నిషేధింపఁబడినది,

## —•♦•) సంస్కారము లెన్ని గలవు? (•♦•—

ధర్మశాస్త్రములలోఁ గొన్ని నలుబది సంస్కారములనియుఁ, గొన్ని యిరవదైదనియుఁ గొన్ని పదునాఱనియుఁ జెప్పుచున్నవి. గౌతమ స్మృతి శాస్త్రము, గర్భాధానము, పుంసవనము, సీమంతోన్నయనము, వివాహము, పంచమహా యజ్ఞములు, అష్టక శ్రాద్ధములు, పార్వణ శ్రాద్ధములు మున్నగునవి నలుఁబది సంస్కారములని వర్ణించినది. అంగీరస మహర్షులవా రిరువదైదని చెప్పిరి. ఇట్లే వ్యాసులవారు తమ స్మృతి యందు గర్భాదానము, పుంసవన, సీమంతోన్నయన, జాతకర్మ, నామకరణ, నిష్క్రమణ ప్రభృతి పదునాఱు సంస్కారములే యని లిఖించిరి. ఈ షోడశసంస్కార విషయమునందు మహర్షులకు మతభేదమున్నను దిగువవ్రాసిన ప్రకారము షోడశసంస్కారములోనే యన్నియు నంతర్భూతములై యున్నవి. అదెట్లన,

"ఆధానం పుంసవనం సీమంతోన్నయనం
జాతకర్మ నామకరణం అన్నప్రాశనం చౌలం ఉపనయనం

బ్రహ్మవ్రతం వేదవ్రతం సమావర్తనం ఉద్వాహః
అగ్న్యాధానం దీక్షా మహావ్రతం సన్న్యాసః॥

మీమాంసా శాస్త్రమునననుసరించిన షోడశసంస్కారములే. వీనిలో మొదటి యెనిమిది సంస్కారములు ప్రవృత్తికి సంబంధించినవియు, మిగత యెనిమిదిసంస్కారములు నివృత్తికి సంబంధించినవియు నైయున్నవి. మను భగవానుఁడు "బ్రాహ్మీయం క్రియతే తనుః" ఇత్యాది వాక్యములద్వారా సంస్కారలక్ష్యము, జీవుని శరీరమును బ్రహ్మత్వలాభమునకు యోగ్యమైనదిగాఁ జేయుటయు నీ బ్రహ్మత్వప్రాప్తి, "త్యాగేనైకేనామృతత్వ మానశుః" మున్నగు వేదమంత్రముల ద్వారా నివృత్తి యొక్క పరాకాష్ఠయందే యగుట సంభవ మగుననియుఁ జెప్పియున్నాఁడు. ఈ కారణమునుబట్టి మీమాంసా దర్శనమందుఁ బ్రవృత్తి నిరోధకమునను నివృత్తిపోషకమునను విచారించి చేయఁబడిన షోడశసంస్కార విభాగమే జీవాత్మ పూర్ణత్వమును బొందుటకు మంచిమార్గమై యున్నదని గోచరించుచున్నది.

ఇఁక నీ షోడశ సంస్కారములను గూర్చిన చర్చ క్రమముగాఁ జేయఁబడుచున్నది.

## -*) గర్భాదానము (*-

షోడశ సంస్కారములలో మొట్టమొదటఁ జేర్పఁబడిన సంస్కారమునకు గర్భాదానమని నామము.

బ్రాహ్మణ్య గుణమును సక్రమముగాఁ బ్రకాశింపఁజేయుటయే దీని లక్ష్యమై యున్నది. ఇట్టి లక్ష్యమును సిద్ధింపఁజేయుటకే గర్భాదాన సంస్కారము సహాయక మగుచున్నది. సంతానము, మాతాపితలయొక్క యాత్మ, హృదయము, శరీరముల నుండి జనించుచున్నదిగదా! ఇందువలనఁ తలిదండ్రుల స్థూల దేహమునందును, సూక్ష్మ శరీరమందును నేయే దోషము లుండునో యా యా దోషములు వారి వారి సంతానమునకుఁ గూడ సంక్రమించును. ఇట్టి విషయమును సిద్ధాంతీకరించుకొని తలిదండ్రులు తమ గర్భగ్రహణ యోగ్యతయు, ఉపయుక్త కాలమును నిర్ణయించుకొని సంతాన జననకాలమందు మనశ్శరీరాదులయందున్న పశుభావమును దొలగించుకొని సాత్త్వికమగు దైవభావము కలవారై యుండుటకే గర్భాదాన సంస్కారము విధింపఁబడినది. దీనింగూర్చి శ్రీకృష్ణుఁడు భగవద్గీతలో నిట్లు చెప్పుచున్నాఁడు.

"ధర్మా విరుద్ధో భూతేషు
కామోస్మి భరతర్షభ"

మనుష్యునియందు ధర్మమునకు విరోధము లేకుండ నుండెడి కామము నేనని దీనియర్థము. దీనింబట్టి మానవునియందలి ధర్మా విరుద్ధమగు కామము భగవద్విభూతియని తెలియుచున్నది. తలిదండ్రులు ధర్మబద్ధ బుద్ధులై ధార్మికమగు సంతతిని గనవలె నను కాంక్షతోఁ గామకేళి జరిపినయెడలనే అది ధర్మావిరుద్ధ కామమగును. దీనివలన ప్రపంచమునకుఁ గల్యాణము చేకూరఁ

గలదు. తలిదండ్రుల చిత్తవృత్తులు సంతానోత్పత్తి సమయము నందెట్టుల నుండునో యా చిత్తవృత్తుల ననుసరించియే సంతానముయొక్క మనస్సు, శరీరము మున్నగునవియు నేర్పడుచుండును. అనఁగా తలిదండ్రులు కామభావముతోఁ గలిసినయెడల గాముక సంతానమును, వీరభావముతోఁగాని, వీరపురుష స్మరణముతోఁగాని వీర దైవచింతనముతోఁ గాని కూడిన యెడల వీరసంతానమును, ధర్మదేవతా స్మరణముతోఁగాని, ధార్మికవర్ణ్యా చింతనముతోఁగాని కలిసినయెడల ధార్మిక సంతతియును జనింపఁగలదు. దీనింబట్టి దంపతులు గర్భాధాన సమయమందుఁ దాము దేవతలనుగాను, అందు పతి ప్రజాపతి యొక్క యంశగలవాఁడనియు, పత్ని వసుమతి రూపమనియు దలఁచి దేవతాచింతన మొనర్చుచు గర్భాధాన కర్మము గావింపవలసినదని యార్యసిద్ధాంతము. గర్భాధాన సంస్కార సమయమందీ వైదికమంత్ర మీ రీతిగాఁ బఠింపఁబడుచున్నది.

"ఓం పూషా భగం సవితామే దదాతు
రుద్రః కల్పయతులలామగుం,
ఓం విష్ణుర్యోనిం కల్పయతు
త్వష్టా రూపాణి పి గుంశతు,
ఆసించతు ప్రజాపతిర్ధాతా
గర్భం దధాతు తే"

[ఋ. అ. ౮, అ ౨, వ ౪౨]

అనగా పుష్టికారకుఁడగు పూషుఁడు (సూర్యుఁడు)ను, రుద్రుఁడును యోనిని గల్పింతురుగాక- వ్యాపకుండగు విష్ణువు గర్భ గ్రహణము గావించుస్థావ మొసంగుగాక, దేవశిల్పియగు త్వష్ట్ర దేవుడు రూపమిశ్రము చేయుగాక-ప్రజాపతి సించనము (తడుపుట) చేయుగాక. సృష్టికర్త గర్భమును సంఘటింపఁ జేయుగాక. మరియు ఇంద్రికళా దేవియు, సరస్వతీ దేవియు, సంతతి కాయువు, వినయము, సత్త్వగుణమును గలిగించెడి యశ్వినీ కుమారులును గర్భాధాన మొనర్చుదురుగాక- ఇట్లు దంపతులు దేవభావయుక్తులై కలిసినచో దప్పక సంతానము సైతము సులక్షణములతోఁగూడి ధార్మికముగలది గాగలదు. ఇందణుమాత్రము సందియ మందఁజనదు ఇదియే సంగ్రహింప బడిన గర్భాధాన సంస్కారముయొక్క పరమరహస్యము. ఈ కాలేయ కాలమహిమవలన నిట్టి యుత్తమ సంస్కారము నామావశిష్టమైనది. ఇపుడు సంస్కారమునందు దైవభావము లేనందువలన పశుభావము గలిగించునదిగానే చూడఁబడు చున్నది. కడుంగడు విచారకరము.

## -*) పుంసవనము (*-

ద్వితీయ సంస్కారమునకు "పుంసవన" మని పేరు. ఈ సంస్కారమును, దీనితరువాత జరుపవలసిన సీమంతోన్న యన సంస్కారము, ఈరెండును గర్భమును రక్షించుటకొరకై యేర్పఱుపఁబడినవి. ఇందువలన గర్భమును ధరించియున్న

సమయమునందే యీ రెండు సంస్కారములు జరుపఁబడు చున్నవి. గర్భధారణ మైనపిమ్మట మనుష్యసంబంధమగు గర్భమునకు మూడవనెల మొదలు నాల్గవనెలవరకును, నారవ నెలనుండి యెనిమిదవ నెలవరకును, నుండెడి యీ రెండు సమయములో గర్భమునకు నష్టమును విశేషముగా కలిగించునవిగా నుండును. అందువలన యీ రెండుసమయములందును మిక్కిలి శ్రద్ధతో జాగరూకతతో నాగర్భిణియొక్క గర్భమును రక్షింప వలసిన యావశ్యకత యున్నది. దీనికొరకు నాగర్భమందలి శిశు వును రక్షించుటకొరకై పై రెండుసంస్కారములు విధింపఁ బడినవి.

పుంసవనమనెడి సంస్కారము సీమంతోన్నయన సంస్కారమునకు ముందుగాఁ జేయునది. ఈ సంస్కారము గర్భముధరించిన మూడవమాసములో మొదటి పది దినముల లోపలఁ జేయఁదగినది. పురుషసంతానమును గనుటయే పుంస వనమను పదమున కర్థము. గర్భాశయమందున్న గర్భమునుండి పురుషుఁడే యుదయించునో, కన్యయే జనించునో. యేది జనిం చునది నాల్గవనెలవరకు నిశ్చయింప వీలులేదు. కారణమేమన, నాల్గునెలలకుబూర్వము పురుషచిహ్నములుగాని, స్త్రీచిహ్న ములుగాని సాధారణముగా నేర్పడవు. ఇట్టి చిహ్నములు తెలియబడకముందే పుంసవన సంస్కారము విధింపబడినది. సాధారణముగా సమస్తదేశములలోని స్త్రీలు స్త్రీసంతానము కంటె బురుషసంతానమునే యభిలషించుచు గౌరవించుచుం

దురు. అందుచే భారతదేశమందు విశేషించి పుత్రసంతాన మునే కాంక్షింతురు. దీనింబట్టి భర్త, పితరుల తృప్తికొరకు వృద్ధిశ్రాద్ధములను, మాంగళిక హోమాదులను, జక్కఁగా గావించి గర్భిణియగు భార్యతో "మిత్రా వరుణులనెడి ఇరువురు దేవతాపురుషులు, అశ్వినీకుమారులనెడి యిరువురును దేవతాపురుషులు, మరియు నగ్ని, వాయువు లిరువురును బురుషులే. నీగర్భమందుఁగూడఁ బురుషుఁడే యున్నాఁడు" అని మంత్రపూర్వకముగా చెప్పినప్పు డాగర్భిణియొక్క హృదయ మానందించి వికసించి హాయిగా నుండఁగలదు. ఇట్టి యానందమువలన నాసమయమందు సహజముగా ఓకరులు మున్నగు వానివలనఁ గలిగెడి భయము, చింత, బడలిక, దుఃఖము, నశించి తిరిగి గర్భపోషణమునకుఁ దగిన బలముసైతము చేకూరగలదు. పుంసవన కార్యమందు రెండు మఱ్ఱిపండ్లను మినుములతోడను, యవలతోడను గలిపి గర్భిణికి వాసనఁజూపించెడి వ్యవస్థ యొకటి గలదు. ఈ వ్యవస్థవలన యోనియందుండెడిదోషము దొలఁగి గర్భరక్షణశక్తి గలుగునని సుశ్రుతము మొదలగు ఆయుర్వేద శాస్త్రములందుఁ జూపఁబడియున్నది. ముఖ్యముగా మోక్షమున కుపయోగించెడి యుత్తమ స్థూల శరీరము నొసంగుటయే యీ పుంసవన సంస్కారమునకుఁ బరమలక్ష్యమనియు, నిదియే యీ సంస్కారమునకు విశేషతయనియు, గుర్తెరుఁగవలయును.

## -*) సీమంతోన్నయనము (*-

మూడవ సంస్కారమునకు సీమంతోన్నయనమని నామము. దీనియొక్క ప్రయోజనముగూడ గర్భరక్షణముకొరకే యైయున్నది. గర్భధారణ మైనతరువాత నారవనెలలోగాని యెనిమిదవ నెలలోగాని, యీ సంస్కారము జరుపఁబడు చున్నది. ఇందు స్త్రీల పాపటను చెరిపివేయుటయే ముఖ్య కర్మము. పాపటయందలి కొన్ని వెండ్రుకలు తీసివేసినపిమ్మట గర్భిణీస్త్రీకి శృంగారము చేయుటగాని, సుగంధాది ద్రవ్యములు పూయుటగాని తగదు. మరియుఁ బూలమాల లోనగునవి వేయుటగాని, పతిని గూడుటగాని యెంతమాత్రము గూడదు.

ఈ సంస్కారమునందు భర్త, వృద్ధిశ్రాద్ధము; చరుపాకము మున్నగునవి గావించినతరువాత ఒక తొడిమతోగల రెండు మేడిపండ్లను, మరియు నితరములగు శుభప్రద పదార్థములను, నొక మంచి పట్టువస్త్రముతో గర్భిణియొక్క కంఠమునందుంచి మొదట "మిక్కిలి బలముగల యీ మేడిచెట్టువలన మిక్కిలి బలముగలదానివి కమ్ము" "ఓ వనస్పతీ! నీవు ఆకులు పుట్టుట వలన నెట్లు సమృద్ధిని బొందుచుంటివో యట్లే యీ గర్భిణి యందుఁ బుత్రరూపమగు ధనము గలిగింతువుగాక" యనెడి యర్థముగల మంత్రమును దొలుత భర్త వినిపించును. పిమ్మట భర్త దర్భకూర్చము-ద్వారా గర్భిణియొక్క పాపటయందలి కేశములను దీసివేసెడి సమయమందు "ప్రజాపతి దేవతల తల్లి యగు అదితికి సీమంతోన్నయన మొనర్చినట్లే గర్భిణికిగూడ

సీమంతోన్నయనముజేసి పుత్రపౌత్రాదులను గలిగించి నా ముసలితనమువరకును దీర్ఘజీవిని జేసెదను" అనెడి యర్థము గల మరియొకమంత్రము జెప్పును. అటుతరువాతఁ బతి పౌర్ణమాసిదేవత మున్నగు దేవతలనుగూడ నిట్లే ప్రార్థించి గర్భదోషములఁ దొలఁగింపఁజేయునవియు, భవిష్యత్సంతానమునకు కల్యాణప్రదంబులు నై గర్భపోషణము గావింపఁజేసెడి నేతితోఁగూడిన చరుపాక ప్రదర్శనము మున్నగు కొన్ని క్రియలఁ జేయును. గర్భమును ధరించియున్న సమయమందు స్త్రీ, ప్రసన్నచిత్తురాలై కామము మున్నగువాని తీవ్రత లేక యుండినయెడల నామెకుఁ గలుగు సంతానము దివ్యము, దీర్ఘాయుష్మంతము, ధార్మికము నై యుండఁగలదు. ఇందుకొరకే సీమంతోన్నయనవిధి విధింపఁబడినది.

## —) జాతకర్మము (—

చతుర్థ సంస్కారమునకు జాతకర్మమని పేరు. ఇది శిశువు భూమిపైఁ బడుటయే తడవుగాఁ గావింపఁబడునది. ఇందు తండ్రి, తొలుత యవపుపిండిని, బియ్యపుపిండిని తరువాత బంగారముతో రుద్దబడిన తేనెను, నెయ్యిని, గైకొని యప్పుడే పుడమిపైబడిన బిడ్డయొక్క నాలుకకుఁ దగిలింపవలయును. దీనితత్త్వమేమో మనమెరుగవలసియున్నది. ఇట్టిక్రియ జరుగు తరుణమునందు "ఈ యన్నమే ప్రజ్ఞ, ఇదియే యాయువు, ఇయ్యదియే యమృతము, ఇవియన్నియు నీకుఁ బ్రాప్తించుగాక" మిత్రావరుణులును, అశ్వినీ కుమారులును, నీకు మేధ నొసంగుగాక!

బృహస్పతియు మేధ నిడుగాక! యనెడి యర్థముగల మంత్రము పఠించును.

ఈ మంత్రమునం దన్నమునుగురించి యొకమారు ప్రార్థింపఁబడియున్నది. బియ్యమును, యవలను శిశువు నాలుకకు నాకించుట దీనినే సూచించుచున్నది ఇందులకు కారణము శరీరరక్షణమే ముఖ్యమగు ప్రథమ ధర్మసాధనమై యుండుటయు ఈ శరీరరక్షణ మన్నమువలననే కావలసియుండుటయునై యున్నది. ఇందుకొరకే తండ్రి తొలుత యవపుపిండిని బియ్యపు పిండిని, బుట్టిన బిడ్డనోటికిఁ దగిలించును. ఈ శరీర రక్షకమగు నన్నమును బ్రార్థించినపిమ్మట దేవతలఁగూర్చి పలుమారు మేధాశక్తికొఱకై ప్రార్థించుట గలదు. ఈ మేధవలన జీవుఁడు తన భావి జీవమునందున్నతి బొందుటకు సర్వవిధములను దగియుండఁగలఁడు. గర్భమునుండి భూమిపైఁబడెడి తరుణమునందు మిక్కిలి కష్టము గల్గుటవలనను మహామాయామోహమావరించి యుండుటవలనను, భూమిమీఁదఁబడ్డ బిడ్డకు గర్భమునందున్న స్మృతి లోపించిపోవును. అట్టి స్మృతిని దిరిగి సంపాదించుటకొరకే యీ మేధాశక్తిని గలిగించు ప్రక్రియ (సంస్కారము) చేయఁబడుచున్నది.

బంగారముతోఁ రాచఁబడిన నేతిని, దేనెను బిడ్డ నాలుకకుఁ దగిలించుటవలన ననేక సుగుణము లున్నవి. చూడుఁడు. సువర్ణము, వాతదోషమును శాంతింపఁ జేయును. మూత్రమును సహాసరి వెడలించును. మఱియు రక్త మార్గ

గతికిఁబోవు దోషమును (బ్లైడ్ ఫ్రిజర్) నశింపఁజేయును. నేయి శరీరమునం దుష్ణము గలిగించును. బలమును బ్రబలింపఁ జేయును. ఇంకను హాయిగా విరేచనమగునట్లు సల్పును. తేనె, ముఖమునఁ గలకలలాడు కాంతిని గలిగించును. చాంగ ముఖమందు గలుగునట్లు చేయును. పిత్తకోశక్రియను వృద్ధిపరచును. కఫదోషమును దూరీకరించును. అనఁగా నీక్రియ (సంస్కారము) వాతదోషమును హరించుటకును, మెడ, నాలుక, కడుపు, పేగులను జక్కఁగాఁ జేయుటకును మలమూత్ర విసర్జనమును సరిగాజేసి కఫదోషమును బోగొట్టుటకునై యున్నది. కనుట మిక్కిలి కష్టమగుటఁవలన బుట్టినబిడ్డ నెత్తురుయొక్క పోకడ పైకుండును. ఆశిశు శరీరమునం దధికముగా కఫము పెరుగుచుండును. ఆ బిడ్డ పేగులలో నొకరకపు నల్లనల్లని మలము కూడి యుండును. అట్టి మలము నెప్పటికప్పుడు ద్రోసి వేయకపోయినచో వివిధ విధములగు పీడలు గలుగుచుండును. ఇందువలననే కాఁబోలు నేఁటిడాక్టరులు (వైద్యులు) సైతము పుట్టినబిడ్డకుఁ దేనెతోఁగలిపిన యాముదము నిచ్చునట్లేర్పాటు చేయుచున్నారు. కాని యీ యాముదముకంటె సువర్ణముతో రుద్దిన తేనెతోగూడిన నెయ్యి యెక్కువ యుపకారి యగును. కాఁబట్టియే మన యార్యశాస్త్రము లాప్రకారము వ్యవస్థ చేసినవి. మొత్తముమీఁద నీ జాతకర్మ సంస్కారమువలన, నుపపాతకములు అనఁగాఁ తలిదండ్రుల శరీరములనుండి యాపాదించిన యనేకదోషములుగూడ నశించితీరును. ఇదియే యార్యశాస్త్ర సిద్ధాంతమని యెఱుఁగవలెను.

## -*) నా మ క ర ణ ము (*-

ఐదవ సంస్కారమునకు నామకరణమని నామము. బిడ్డజనించి పదిరాత్రు లయినతరువాత నీ సంస్కారము జరుప బడును. ఈ నామకరణ సంస్కారము దశరాత్రములు గడచిన మీఁదటనే చేయఁబడవలె ననెడి నియమముయొక్క తాత్పర్య మేమనగా, సూతికా గృహమునందు జచ్చెడి బిడ్డలలో రమా రమి మూడువంతు లాపది దినముల లోపలనే గిట్టుచుందురు. ఇందువలన నీ మొదటి పది దినములు విడువ బడినివి. ఈ నామ కరణ సంస్కారమునందు శిశుజన్మ కాలమందలి గ్రహములను, నక్షత్రములను, దేవతాదుల నుద్దేశించి పూజాజప హోమ దానంబులంగావించి శిశువునకుఁ బేరుపెట్టుట తండ్రికి విధియై యున్నది. అందీ యర్థముగల మంత్రము పఠింప బడును "నీవెవ రవు? నీ జాతియేది? నీ వమృతమవు, ఓ అమృతా! నీవు సూర్యు నకు సంబంధించిన మాసమునందుఁ బ్రవేశింపుము. ఓ అమరా! సూర్యుడు నిన్ను ఒక దినమునుండి మరియొక దినమునందు ప్రవే శింపజేయుగాక! దినము రాత్రియందు బ్రవేశింపజేయుగాక. దివారాత్రములు పక్షమందు ప్రవేశింపజేయుగాక. పక్షము పూర్ణమాసమందు ప్రవేశింపజేయుగాక. మాసము ఋతువు నందుఁ ప్రవేశింపఁజేయుగాక! ఋతువు సంవత్సరమునందు సంవత్సరము శతసంవత్సరసీమవరకును జేరునట్లు చేయు గాక," అని. ఇట్టి దివ్యమంత్రముద్వారా యాత్మ కమృతత్వమును బ్రతిపాదించి బిడ్డను దీర్ఘాయువు గలుగునట్లు ప్రార్థింప బడి

నది. ఈ నామకరణ సంస్కారము వలన నామములయొక్క
భిన్నత ననుసరించి జాతి భిన్నతగూడ నిర్ణయింపఁ బడును.
నామముతోఁగూడ భావమునకు సంబంధముగలదు. ఇందువలన
వర్ణభేదమునుబట్టి నామభేదము గలుగుటచే నా నామముగల
వాఁడు తన వర్ణము ననుసరించిన యున్నతాశయ లాభము
లను బొందుచున్నాఁడు. నామ ద్వారమున, నమృతుండగు
బ్రహ్మతో సంబంధమును గలిగించుకొనుట, శతాయువుకొరకు
వేడుట, యంతఃకరణమునకు బలవృద్ధి, మరియు ఆయుర్వృ
ద్ధియుఁ జేకూర్చుకొనుట జరుగును.

## -*) అన్న ప్రాశనము (*-

ఆరవ సంస్కారమునకు అన్న ప్రాశనమని పేరు.
పుత్రుఁడైనచో నాఱవ నెలనో, యెనిమిదవ నెలనో, పుత్రి
యైనచో నైదవ నెలనో, యేడవ నెలనో యీ సంస్కారము
జరుపఁబడుచున్నది. ఈ సంస్కారము వలనఁ దినఁదగిన పదా
ర్థములు నిర్దిష్టము లైనందుచేత నన్నమందలి సంకర దోషము
నిరాకరింపఁబడుచున్నది. ఈ యన్నప్రాశన సంస్కారము
జరుపుటకు మంచితిథి, వార, నక్షత్ర, లగ్నములతో గూడిన
ముహూర్తము చూడవలసి యుండును. ఇట్టి సుముహూర్త
మందుఁ దండ్రి, వృద్ధిశ్రాద్ధము నొనరించి శిశువును నంకమునం
దిడుకొని కూర్చుండ వలెను. ఇతని కెడమ భాగమున భార్య
కూర్చుండ వలెను. అప్పుడు తండ్రి మంత్రమును బఠించుచు
హోమము గావించి తరువాత బిడ్డనోటిలో నన్న మిడవలెను.

"అన్నమే సమస్త జీవరక్షకము, అన్నమునకుఁబతి సూర్యుడు. ఆ సూర్యుఁడన్నమును, శుభమును నీబిడ్డ కొసంగుఁగాక" యను భావముగల మంత్ర మీ సమయమందు ఉచ్చరింపఁబడును. ఈ సంస్కారము వలన శిశువునకు మాతృగర్భమునందు మాలిన్యమును దినుట వలన గలిగిన కలుషము దొలఁగి నిర్మలత్వము గలుగును. ఉపనిషత్తులలో నన్నము బ్రహ్మమని చెప్పఁబడినది. దీనింబట్టి తొలుత జరిపెడి యీ యన్నప్రాశనమందు బ్రహ్మచర్యము, బలము, ఆయువు, అంతఃకరణశుద్ధి స్థాపనము గలిగి బ్రహ్మ భావోద్బోధన జనించును. ఇదియే ఈ సంస్కారమునకు లక్ష్యమని యెరుంగవలెను.

-*) చౌలము (*-

సప్తమ సంస్కారమునకు "చౌలము, మరియు "చూడాకరణ"మని యందురు. బిడ్డకు మూడవయేడు వచ్చిన పిదప నిది చేయుదురు. ఇదియే ముఖ్య సమయము. ఇందు బిడ్డయొక్క తలవెండ్రుకలను దీసివేయుటయే ప్రధాన కార్యముగా నుండును. శిశువునకు గర్భమునందుఁ బుట్టిన వెండ్రుకల నన్నిటినీ దీసివేసి చూడాకరణ మొనర్చి దీనిద్వారా శిక్షయు సంస్కార యోగ్యతయుఁ గలిగింపఁబడును. దీనినిబట్టి యీ చూడాకరణ సంస్కారము వలన బిడ్డకుఁగల యపాత్రతా దోషము నిరాకరింపఁబడును.

వృద్ధిశ్రాద్ధము, హోమము మున్నగునవి జరిగినమీఁద సూర్యభగవానుని బ్రార్థించుచు "సూర్యుఁడెద్దానితో బృహ

స్వతికిఁ గేశఖండన మొనర్చెనో, దేనితో వాయుదేవు డింద్రునికి కేశఖండనము జేసెనో యట్టి బ్రహ్మరూపియగు సుధితి (కత్తి) ద్వారా నేను నీకు గేశఖండనము జేయుచున్నాను. నీ కాయు స్తేజోబలాద్యభివృద్ధులు లభించుఁగాక" యని యీ మొదలగు భావములుగల మంత్రములను బఠించును.

ఈ చూడాకరణ సంస్కారమునందు "శిఖ" మాత్రఁ ముంచి మిగిలిన వెండ్రుక లన్నియుఁ దీసివేయవలెను. దీనివలన అయుస్తేజో బలాదులు లభింపఁగలవు. ఈ విషయమునే దీర్ఘాయుష్ట్వాయ బలాయ వర్చసే శక్త్యైశిఖాయైవషట్" యీ మొదలగు వేదమంత్రములు స్థిరీకరించు చున్నవి. శిఖ నుంచుటకును ఈ సంస్కార నామమునకును సంబంధ మేమి గలదో మనము వైజ్ఞానిక దృష్టితో నిప్పుడు విచారింపఁ దగి యున్నది.

శిఖఁ బెట్టుకొనిన వానిని భూషించుటయు, శిఖలేనివానిని దూషించుటయుఁ గేవలమొక యార్యశాస్త్రములందేగాదు- మీదుమిక్కిలి మిక్కిలిప్రాచీన కాలమునుండి యితర దేశీయ జాతీయులందుఁగూడ నున్నట్లు స్పష్టమగుచున్నది. చూడుడు.

Strength was supposed to be in the hair and the cutting of it off brought weakness to the body Criminals who refused to confess even under tor. ture, have done so when their hair was cut off. S- Sampson was powerless when his locks were cut off. In ancient Israel mourners cut off their hair

to make the head bald. Amos, in pronounciug a doom on Israel, says 'baldness shall be on every head' and Ezekiel also speaks of the time when baldness shall be on all heads.' You shall not cut yourselves nor make any baldness between yonr eyes for the dead. (Dent XIV. I.)

వెండ్రుకలందు బలమున్నది. వెండ్రుకలు పూర్తిగా గొరిగించుటవలన దౌర్బల్యము కలుగును. ఇట్టి వీరి ప్రాచీన కాలమునుండియు గలదు. అపరాధము జేసినవారలు నెట్టి శిక్షలనైన నెట్టి కష్టమునైన బొందెడివారుగాని యపరాధ మంగీకరించెడివారుగారు. కాని శిరోముండన మైనతరువాత నంగీకరించెడివారు. ఇట్టి వనేక దృష్టాంతరము లున్నవి. సెమ్సన్ అనువాఁడు తన శిఖను గత్తిరించుకొనినప్పు డతఁడు శక్తిహీను డయ్యెను. పూర్వము ఇస్రాయేలు శోకించు సమయములో శిఖను తీసివేసియుండెడివాఁడు. ఎమ్సన్ అనువాడు ఇస్రాయెల్‌ను శపించినప్పుడు "అందరి నెత్తుల గొరిగింపఁబడును" అని చెప్పెను. "ఇజ్కైల్" అను పాశ్చాత్య వైజ్ఞానిక పండితుడుగూడ" జనులందఱు శిరోముండనము జేయించుకొని బలహీనులగు సమయము రాఁగలదని చెప్పియుండెను. దీనిం బట్టి శిరోముండన మొనర్చి జనులు దౌర్బల్యమును పొందగూడదనియు, మృత వ్యక్తికిఁగూడ నది చేయుట దగదనియు తెలియుచున్నది. ఇట్టి ప్రాచీనములగు ప్రమాణములనుబట్టిచూచినచో నేక బ్రపంచమందలి యనేక జాతులవారిలో నెల్లప్పుడు శిఖ యుండెడి పద్ధతి గలదని సిద్ధించుచున్నది. మరియు శిఖా

మూలమున బలము రక్షింపఁబడుచున్నదని వైజ్ఞానిక లోకము తలఁచు చున్నట్లు వ్యక్తమగు చున్నది. దీనిని గురించిన వైజ్ఞానిక రహస్యమేమో యిప్పుడు విచారింపఁ బడుచున్నది.

వెండ్రుక లెట్టిపదార్థములు? పురుషులకు వెండ్రుక లెక్కువగాను స్త్రీలకుఁ దక్కువగాను మొలచుటకు గారణ మేమి? యను విషయములను గురించి పుంస్త్రీ ప్రకృతి తారతమ్యములనుగూర్చి పాశ్చాత్యపండితు లిట్లు వ్రాయుచున్నారు.

In the metabolic rhythm of life, Katabolic surplus of men leads to its corresponding secondary sex-expressions, primarily in the growth of hair on the cheeks and the breast, while the anabolic surplus of the women does not put on similar expressions but expends itself as periodic menstrual discharge or the feeding of the foctal growth or her lactation. Preponderant Katabolic organism can be distinguished from the preponerant anabolic one from the biological evidence that while the former is "active and roeming, is a hunter for his partner an[illegible] is an expender of energy the latter is passive and sedentary, one who waits for her partner and is a consumer of energy The marculine activity tends to a greater power of maximum effort, of scientific insight, of cerebral experiment with impressions and is associated with an unobservant or impatient disregard of minute details, but with a stranger grasp of gene-

ralaties. The feminine passivity is expressed in greater patience, more open-mindedness, greater appreciation of subtle details and consequently what we call more rapid intention. (Sex, Home University Serles P,)

స్త్రీకిని బురుషునకును యౌవనము వచ్చునప్పుడు పురుష శక్తియొక్క వికాసము మొగముజొమ్ము మొదలగు ప్రదేశములందు వచ్చెడి. కేశముల యుత్పత్తిద్వారా యగుచున్నది. ఇఁక స్త్రీలకో యిట్లుకాక వారిశక్తి, నెలనెలకు గలిగెడి ఋతుధర్మము స్తనములయందు పాలు, గర్భకోశము వృద్ధియగుట మున్నగు వానివలన వికసించు చున్నది, మొదటిదానికి "కైటాబలిక్" అనియు రెండవదానిని "ఐనాబలిక్" అనియు ఇంగ్లీషుభాష లో బల్కుదురు. ఈ రెంటిభేదముననుబట్టి స్త్రీ పురుషుల ప్రకృతుల యందుగూడఁ మిక్కిలి భేదమున్నట్లు కన్పట్టుచున్నది. ఎట్లనెదరా! పురుషుఁడు స్వయముగానే క్రియాశీలుఁడై భార్యకొరకు వెదకు వాఁడును, నితరులకై తనశక్తిని క్షీణింపజేసికొనువాఁడును నగును. కాని స్త్రీ, యట్లు స్వయముగా క్రియాశీల గాక తన భర్త కొరకై యెట్టి చేతలు చేయక యెదురుజూచుచు బలమును దన యందు జక్కఁగాఁ గూర్చుకొనుచుండును. పురుషునియందు సహజముగాఁ గ్రియాశీలత యున్నందువలన జ్ఞాన విజ్ఞానముల రాజ్యమునందతని కధిక ప్రవేశ ముండును. అతని బుద్ధియందు బాహ్యములగు వస్తువుల సంస్కారము మిక్కిలి నెలకొని యుండును. మరియుఁ బురుషుఁ డేవిచారణ యందును సాధా

రణ సూక్ష్మాంశములయందు ప్రవేశింపక విచార విషయము లను జక్కగా విమర్శించి యొక సాధారణ నిర్ణయమునకు వచ్చును. స్త్రీజాతికి సహజముగాఁ గర్తృత్వము లేకపోవుట వలన ధైర్య మెక్కువగాఁ గల్గును. మరియు స్త్రీలు తాము విశ్వసించినవారి సమీపమున నెట్టి దాపరికములేని మానసము గలవారై యుందురు. ఏ విచార విషయమునందుఁగూడఁ సాధారణమైన నిర్ణయమునకు వత్తురు. ఇందువలననే పురుషులకంటె స్వాభావికమైన మనోవేగము, ప్రేరణము మున్నగు గుణములీ స్త్రీలయందు విశేషించియుండును ఇట్లు స్త్రీ పురుషుల స్వభావములందు భేదము గన్పడుచున్నది. ప్రస్తుత విషయము కేశనిర్గమన సంబంధకము యౌవన వికాసమువకును, కేశనిర్గమనమునకు సంబంధమున్నందున వృక్షముయొక్క కొమ్మను నఱికినందువలన దానియందు మరియొక క్రొత్త కొమ్మ పుట్టుటకు శక్తి వృద్ధి పొందుచున్నట్లు ప్రతిదినము లేక తఱుచుగా వెండ్రుకలను గత్తిరించుచున్నను. క్షౌరము జేయించుచున్నను లోపల నణగియున్న కామశక్తి, స్నాయువు (నరము)లం దెక్కువగాఁ బ్రకటమగుచుండును. ఇదే, బ్రహ్మచారులు, వానప్రస్థులు, సన్యాసులు మొదలగువారికి కేశధారణవిధి శాస్త్రములందు విధింపఁబడుటకుఁ గారణమైనది. కేశములను బెంచినందువలన గామమునకు సంబంధించిన నరముల వేగము సహజముగాఁ దగ్గిపోవుచుండును. మనుష్యుఁడు ప్రయత్నముగానే సంయమిగా మారిపోవును, సన్న్యాసి, కుటీచక, బహూదకను

లనెడి అవస్థలను దాటి "హంస" యనెడి అవస్థను బొందు చున్నప్పుడు "సోహంభావమునందుఁ గామచింత యేయుండదు." ఇందువలననే దండధారణముచేయు స్వాములు కేశముండనము చేయుటకిదే కారణము. గృహస్థుడుగానుండు దశలో సమస్త కేశములు నుంచుట సౌకర్యముగా నుండదు. అందువలన గోక్షురమువలెఁ దల పైభాగమునందు వెండ్రుకల నుంచి మిగిలిన వెండ్రుకలను తీసివేయవలసినదనెడి విధి శాస్త్రము లందు చెప్పఁబడినది. ఇందనేక లాభములున్నవి. గోక్షుర ములో తలముందటిఁ గొంతభాగమును, తలవెనుకఁ గొంత భాగమును గప్పియుండును. అదియే శిఖాభూషముగా శిరముపైన నుండును. యోగశాస్త్ర సిద్ధాంతము ననుసరించి తలముందటి ఆ భాగమునకు దిగువను, బ్రహ్మరంధ్రము గలదు. ఆ బ్రహ్మ రంధ్రమునకు సరిగా మీఁదనున్న సహస్రదళ కమలము పరమాత్మకుఁ గేంద్రస్థానమైయున్నది మఱియు డాక్టరీ(వైద్య) సైన్సు (పదార్థ విజ్ఞానశాస్త్రము) సిద్ధాంతము ననుసరించి తల వెనుకనున్న ఆభాగము అనగా సరిగాదానిక్రిందనున్న బ్రైన్ సెల్ (Braincell) లేక మస్తిష్క భాగము కామమునకుఁ గేంద్ర స్థానమై యున్నది. అందువలన నీ రెండుభాగములును గప్పు కొనెడి శిఖాస్థానమునందు వెండ్రుక లుంచుటచేత నిదివరకుఁ జెప్పినట్లు ఆత్మికశక్తి చేకూరును. చింతాశక్తి యణఁగియుం డును. ఇది నిజము. భిన్నభిన్నములైన జాతులం దందును ముఖ్యముగా ఆర్యజాతియందు శిఖకును, బలము, బ్రహ్మ

చర్యము, ఆయువు, తేజస్సుల రక్షణమునకును సంబంధమున్న విషయము చూపఁబడినది. కేవలమింత మాత్రమే కాదు, గోక్షుర రూపముగానున్న శిఖయుండుటచేత వ్యాపకుండగు బ్రహ్మ శక్తిని కేశములద్వారా యిష్టము వచ్చినట్లాకర్షించుటగూడఁ గలుగును. పాశ్చాత్య పండితుండగు విక్టర్. ఇ క్రోమర్ (Victor. E Cromer) "బ్రిల్" అను పేరుగల ఓజశ్శక్తిని వెల్లడించెడి విషయమున, వర్ణించుచు వర్ణించుచు నొకచోట నిట్లు వ్రాసియున్నాడు—

"In meditation one receives the vrillic influx. While concentrating one pours it out. If one, however, concentrates one's mind upon God, there is an outgoing and an inflowing process set up. The concentration of the mind upwards sends a rush of this force through the top of the head and the respone comes as a fine rain of soft magnetism. These two forces cause a beautiful display of color to the higher vision. The out pouring from above is beautiful beyond description.

(Vril—Kalpaka)

ధ్యానించు సమయమున నోజశ్శక్తి ప్రకటమగును. ఏ వస్తువును గురించికాని యే విషయమునుగురించికాని, చిత్త మేకాగ్ర మొనరించినచో నోజశ్శక్తి దానివైపు పరుగిడుచుండును. పరమాత్మనుగూర్చి చిత్తమేకాగ్రము గావించినచో శిరముపై నున్న శిఖమార్గముద్వారా యోజశ్శక్తి వెల్లడి యగుచుండును మఱియు నా తీవ్రవనే పరమాత్మశక్తియు దనలోనికి వచ్చు

నట్లు జేసికొనుచుండును సూక్ష్మదృష్టి సంపన్నులగు యోగులీ రెండు శక్తుల మనోహరవర్ణముగూడఁ జూడఁగలరు. ఏశక్తి, పరమాత్మనుండి తనలో జేరుచున్నదో దాని సుందరత్వమునకు సాటి యెట్టిదియు లేదు. అందువలన నధునాతన విజ్ఞానము వలనకూడ శిఖద్వారా మీఁదినుండి శక్తి సంక్రమించునని సిద్ధించినది. ఇదియే బ్రహ్మచర్య, బల, తేజస్సులు, ఆయువు లును వృద్ధియగుటకుఁ గారణము. పరమహంసయగు సన్న్యాసి యెల్లప్పుడు బ్రహ్మముతోఁ గలియుచుండును. ఇందువలన నా మహాత్మునకు ప్రత్యేకించి శిఖామార్గముగా శక్తిని సంగ్రహింపవలసిన యవసరములేదు. బ్రహ్మచారియు, వానప్రస్థుడును జడలవలనను శిఖవలనను, గృహస్థులు గోక్షురరూప శిఖాముఖమునను దైశక్తిని సంపాదించి తమ యాధ్యాత్మికాధిదైవి కోన్నతులను బొందుదురు ఇంతేగాక శిఖాధారణము, శిఖామార్జనము, శిఖా స్పర్శనము శిఖా బంధనము లోనగు క్రియలచేత బ్రతిసమయమందును సహస్రదళ కమలమువైపు దృష్టి పడుటవలన నాత్మసంబంధమైన దృష్టి తప్పక వృద్ధి జెందుచుండఁగలదు. ఇదంతయు చూడాకరణ సంస్కారమందు శిఖనుంచు ఫలమని గుర్తెరుంగవలెను.

మాటిమాటికి వెండ్రుకలను గత్తిరించుటను గడ్డము మీసములను క్షౌరము జేయించుటను, "క్తైటాబలిక్" ఉత్తేజనముచేతఁ గామసంబంధమగు నరములలో నుత్తేజము జనించునని యీవరకే చెప్పఁబడినది. ఇందువలన నిట్టి మనుష్యుఁడు

సాధారణముగా విషయలాలసుఁడు గాఁగలఁడు. ఇంక నితనికి స్థూల శరీరమును నందము గావించుకొనుటకు మనస్సు గల్గును. దీనివలన నాత్మోన్నతి నశించి కేవలము విషయవిలాసిగా మారెడి దశ పట్టును. ఆర్యశాస్త్రము లిష్టమువచ్చినప్పుడు క్షౌరము జేయించుకొన గూడదనియు, నే మంచిదినముననో క్షౌరము చేయించుకొనవలయునని విధించుటకుఁ గారణమిదియే. ఈ మంచిదిన విషయమునుగూర్చి యెట్లు వ్రాయుచున్నారో చూడుఁడు.—

"The removal of hair and nails at the prescribed times helps the conservation and absorption of powers shed by the stars and the heavenly aspects of the days and the hours. The ancient Munis have also thought that at the prescribed times of shaving the hair and nails are lifeless, their psychic connection with the individual is not active, but is dormant; if they even fall into the hands of evil workers, they are useless with them. But if at forbidden times we do shaving it acts contrarivise."

(The Science and Religion of shaving- Sanatanist)

మంచిదినము చూచుకొని కేశములను, నఖములను కత్తిరించినయెడల నా దినమందలి యా సమయమునందలి నక్షత్రముయొక్కయు దినము నభిమానించెడి దేవతయొక్కయు శక్తి ప్రాప్తించును. ఇదియునుగాక ఆ తిథియందును ఆసమయమందును నఖకేశములయందు జీవనశక్తి యుండదు. అనఁగా

మనుష్య శరీరమునకును నా నఖకేశముల సూక్ష్మ చేతనమునకును సంబంధముండదు. ఇట్టి దినములయందు జరిగెడి కేశముండనము ద్వారా కలిగెడి "కైటాబలిక్" నరముల యుత్తేజనముగూడ నుండకపోవుటకుఁ గారణమిదే. మఱియు నిట్టి కేశ, నఖము లేకుచ్ఛిత మాంత్రికుని చేతులలోఁ బడినప్పటికిని వానిని దురుప యోగ మొనర్పఁజాలఁడు. ఇఁక నేమనగా! వారములేక, వర్జ్యము లేక, తిథిలేక, నక్షత్రములేక యిష్టమువచ్చినప్పుడు వెండ్రుకలను గాని, గోళ్ళనుగాని కత్తిరించినప్పు డిదియంతయు నాపదల కాక రంబు గావచ్చును. ఇది కేశములయు, నఖములయు, విషయ విచారణమందలి గూఢవిజ్ఞానము.

స్త్రీలకు కేశములను గత్తిరించుకొనెడివిధి లేదు. ఎందుల కనగా! వారికి ఋతుధర్మము, చనబాలు, మావి, మున్నగు వానివలనఁ స్త్రీశక్తివికాసము, గలుగును. ఇందువలన స్త్రీలు నేటికాలమందలి పాశ్చిమాత్య శృంగారవతులవలెఁ బురుషుల మాదిరి వెండ్రుకలను గత్తిరింప మొదలిడినయెడల నది ప్రకృతి విరుద్ధమగు నాచారమును నాచరణలోనికి దీసికొనివచ్చుట యగును. ఇందులకుఫలమేదనఁగా, వారిలో "కైటాబలిక్" ప్రేరణ శక్తి బలాత్కారముగా హెచ్చించినమీఁద "ఐనాబలిక్" ప్రేరణ (స్త్రీసులభ) శక్తి తగ్గిపోగలదు. మఱియు వారి ప్రాకృతిక శక్తియందును బాధగల్గును. దీనివలన ఋతుధర్మము, స్తన్యము మున్నగువాని నన్నిటి యందును బాధగలిగి యథార్థమగు "తల్లి" కాజాలదు. కాని యామె యందు మాతృభావము నశించి పు

భావము రా మొదలిడును. జరాయువు, ప్రసవము, ఋతు ధర్మము లోనగు విషయములం దనేక విధములగు రోగములు పుట్టుచుండును. ఈవిషయమునుగురించి సుప్రసిద్ధులగు పాశ్చాత్యులనేకవైద్యు (డాక్టరు) లెంత దుఃఖించుచు వ్రాసిరో చూడుడు.

Dr. Gillard Thomas, the American Gynaecologist, says that only about 4 per cent of American women proper are physically fitted to become wives and mothers. Dr Stanlay Hell gives a large body of statistics showing the alarming unfitness of the Anglo-Saxon women for maternity.

అచటి (అమెరికా దేశములోని) స్త్రీలు పురుషులవలె వెండ్రుకలను కత్తిరించుకొనుచు స్థూల వ్యాయామము చేయుచుండుట వలనఁ గేవలము వారిలో నూటికి నాల్గవవంతు మాత్రమే సంతానము పుట్టించి మాతృభావము గల్గియుండెడి శక్తి గల్గియున్నదని యమెరికా డాక్టరు గిల్లర్డు థామస్‌గారి యభిప్రాయము.

ఇంగ్లండులోని స్టాన్లీహెల్ డాక్టరుగారు తమదేశమునందలి లెక్కలను మిక్కుటముగాఁజూపించి తుట్టతుదకు మన స్త్రీలు పుంభావముబొంది మాతృభావమునుబొందుట కయోగ్యులైరిగదా యని చింతించుచు వ్రాసెను. ఇట్టి కారణములనన్నిటి నెఱింగియే మన మహర్షులు శాస్త్రములందు స్త్రీలు పురుషులవలెఁ గేశములను కత్తిరించుటగాని, స్థూల వ్యాయామాదుల

నొనరించుటగాని పనికి రాదని వ్రాసిరి. ఇంతేకాక ప్రాయ శ్చిత్తమందుగూడ స్త్రీలకుఁ గేవలము నాలుగంగుళములవరకు మాత్రమే కేశములను గత్తిరింపవలసినదని విధింపఁబడినది. కాని పూర్తిగా శిరోముండనము విధింపబడలేదు. విచారింపగా కురులు కోమలాంగులకు శృంగారవస్తువై యున్నది. ఇంకను నివృత్తిమార్గముగల యాశ్రమమునందు "ఐనాబలిక" ఉత్తేజ నావశ్యకత యుండదు. ఇందువలననే వైఖనవ్యాశ్రమమందు స్త్రీలకు శిరోముండనము పూర్తిగా జేయవలసినవిధి శాస్త్రము లలో

"విధవా కబరీబంధో, భర్తృబంధాయ జాయతే"

అను మున్నగు ప్రమాణములతో శాసింపఁబడినది.

శిఖ యుంచవలసిన పద్ధతియుఁ బ్రాచీనకాలమందనేక జాతులయందీశిఖ యుండినసంగతియుఁ దొలుతనే వచింపఁబడి నది. హీబ్రూజాతీయమగు "తల్మద్" (Talmud) అను శాస్త్రగ్రంధమునందు శిఖ నుంచవలయుననెడి విషయమును గూర్చి మిక్కిలి చర్చించెను ఈ చర్చవలన హీబ్రూజాతియు శిఖను దప్పక యుంచుచుండెడిదని నిరూపింపఁబడినది. బైబిలు పుస్తకమునందు సాంసన్ ఎగోనస్టిస్ (Samson Agonostis) విషయమందు

"ఇతని ప్రతాపమునకు రాజగణము వణఁకుచున్నది. ఇతనిం జంపుటకు వారనేకవిధముల మహత్తరప్రయత్నములం గావించిరి. కాని యవియన్నియు వ్యర్థములయ్యెను. చిట్టచివర

కా రాజులు యోజించి యోజించి యతని శిరమున శిఖయున్నట్లు కనిపెట్టిరి

(At last they discovered that all his power lay on account of the tuft on his head)

దీనివలన నితనియందింత గొప్పశక్తి యున్నదనితలంచి యాలోచించి యతఁడు నిద్రించుసమయమునుజూచి మిక్కిలి నేర్పుతో నతని శిఖను గత్తిరించివేసిరి. తెల్లవారినతరువాత నతఁడు నిద్రనుండి మేల్కొని తన శిఖ గత్తిరింప బడియుండుటయు దన శక్తి నష్టమైపోవుటయుఁ జూచెను అతఁడు శత్రువులచేత బరాజితుడయ్యెనని యొక కధ లిఖింపఁబడియున్నది. ఈరీతిగానే హరివంశ పురాణమందుగూడ నొకకధ చిక్క గలదు. ఎట్టిదనఁగా, "వశిష్ఠమహర్షికి జగజ్జేతయగు క్షత్రియ శిష్యుడొకడుండెను. ఇతనిరాజ్యములోఁ బశ్చిమభాగమునం దుండువారును, పితృహంతకులును నగు కొందరు రాజు లాజగజ్జేతకు మిగుల భయపడి వశిష్ఠమహర్షి దరి కరుదెంచి శరణు జొచ్చి తమ ప్రాణములను రక్షింపవేడుకొనిరి. ఆ మహర్షియు గరుణామయుఁడై వారు ప్రార్థించినట్లు ప్రాణరక్షణ మొనర్చుటకు వాగ్దానమొనర్చెను కాని తరువాత నా మహర్షికి వారిని జయించువాఁడు తన శిష్యుఁడేయని తెలిసెను. అప్పుడామహర్షి తన ప్రతిజ్ఞను, తనశిష్యుని ప్రతిజ్ఞను రక్షించుటకొరకు శిష్యునిం బిలిచి "ఛాత్రచూడామణీ! వీరి ప్రాణములను దీసివేయకుము. కాని వీరి శిఖలను గత్తిరించివేయుము. ఇందువలన వీరందరు

శక్తి విహీనులై జీవన్మృతులగుదురు." అని యాజ్ఞాపించెను వీరవరేణ్యుండగు నా క్షత్రియశిష్యుఁడు గురుఁడాదేశించిన చొప్పున జేసెను. శిఖతో బలము, వీర్యము, స్థైర్యము, ఆధ్యాత్మికోన్నతుల కింతింత యని చెప్పనలవికాని గొప్ప సంబంధముండుటయే కారణము కనుకనే శిఖాధారణము హిందువుల కొక యుత్తమ జాతీయచిహ్నముగా బరిగణింపబడినది. చూడాకరణ సంస్కార మీ జాతీయ చిహ్నమున్నకు మొదటి సన్నివేశమగును.

## -*) ఉపనయనము (*-

ఎనిమిదవ సంస్కారమునకు "ఉపనయన" మని పేరు. ద్విజాతి (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య) బాలకులీసంస్కారము వలన జ్ఞానశిక్షను సంపాదించుటకొరకై ఆచార్యుని సమీపమునకు వత్తురు. కనుక దీనిపేరు "ఉపనయన" మని యందురు. ద్విజులీసంస్కారమువలననే ద్విజత్వలాభమును బొందుదురు. యాజ్ఞవల్క్యస్మృతియం దిట్లున్నది.

> మాతురగ్రేధిజననం ద్వితీయం మౌంజిబంధనాత్
> బ్రాహ్మణక్షత్రియవిశ స్తస్మా దేతే ద్విజాస్స్మృతాః॥

బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు, దొలిజన్మము తల్లిగర్భమునుండియు, రెండవజన్మ ముపనయన సంస్కారము వలనను గలుగును. ఇందువలనఁ బై మూఁడుజాతులవారికి ద్విజు

లని పేరు. ఉపనయనకాలమునుగూర్చి గృహ్యసూత్రము, ధర్మ సూత్రములిట్లు చెప్పుచున్నవి,

"వసంతే బ్రాహ్మణంగ్రీష్మే రాజన్యం శరది వైశ్యం గర్భాష్టమేబ్దే బ్రాహ్మణం గర్భైకాదశే రాజన్యం గర్భద్వాదశే వైశ్యం"

వసంతర్తువునందు బ్రాహ్మణబాలకులకును, గ్రీష్మర్తువునందు క్షత్రియబాలకులకును, శరదృతువునందు వైశ్యబాలకులకును, ఉపనయన మొనరింపవలెను. ఉపనయనమునందు ఋతువిచారణము బ్రాహ్మణాదివర్ణముల ప్రకృతివిచారణమును బట్టి చేయఁబడినది. "ఋతూనాం కుసుమాకరః" అనుదానితో శ్రీ భగవానుఁడు వసంతకాలమును దన దైవసంపత్తని జెప్పెను. అందువలన బ్రాహ్మణబాలకులకీ ఋతువే యోగ్యము. గ్రీష్మములోని మండుటెండ (సూర్యశక్తి) క్షత్రియుల ప్రకృతులకు దగినది శరత్కాలమునందలి పోషణశక్తి వైశ్యప్రకృతి కనుకూలముగా నుండును. అష్టవసువులతో దేవరాజ్యమునందు బ్రాహ్మణులకు మైత్రియున్నందున నెనిమిదవ యేడునందు బ్రాహ్మణబాలురకును, రుద్రప్రకృతితో సామ్యమున్నందున బదునొకండవయేట క్షత్రియులకును, పోషణశక్తిగల్గిన సూర్యునితో సంబంధమున్నందున వైశ్యులకుఁ బండ్రెండవయేటను "ఉపనయనము" విధింపఁబడినది.

శూద్రులకు వేదాధికారము లేదు. అందువలన నుపనయన సంస్కారముగూడ వారికి విధింపఁబడలేదు. కారణ

మేమనగా, వేద మంత్రములను ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము మున్నగు భేదములలో నుచ్చరింపవలసి యుండును ఎవని కేవిధమైన శారీరక సంబంధము లేదో యెవనికిఁ గంఠము నందసంపూర్ణత లేదో యా మనుష్యుఁడే యా భేదములతో నా వేదమంత్రముల నుచ్చరించుట కర్హుఁడగును. లేనిచో మహా భాష్యమునందలి ప్రమాణము ననుసరించి యశుద్ధమును, స్వర, వర్ణ, హీనమునగు నుచ్చారణముతో నుచ్చరించువారికి లాభము లేకపోవుటయే కాక ప్రబలమగు కీడుగూడ సంభవించును. శూద్ర వర్ణమునకే ప్రకృతియందు జన్మించుట సంభవించునో యద్దానియందు ప్రాకృతికమగు శారీరకాసంపూర్ణత యుండు నని నిశ్చయింపబడినదై యున్నది. అందువలన నట్టివారిచే ఉదాత్తానుదాత్త స్వరితములతోఁ గూడిన వర్ణములు గల మంత్రములను జక్కగా నుచ్చరింపఁ బడుట యసంభవము. మఱియుఁ బ్రకృతి విరుద్ధమగు నా కార్యము గావించిన యెడల వారికి హాని సంప్రాప్తింపఁ గలదు. ఇదే నిగ్రహానుగ్రహ సమర్థులును త్రికాల దర్శులును, బరమపూజ్యులు నగు మన మహర్షులు శాస్త్రములందు శూద్రులకు వైదిక వ్యవస్థ చేయక పౌరాణికోపాసనాదుల విధించుటకు గారణము. ఇంక నీ విషయమును గురించి సంబంధానుసానముగా మరియొకచోట విశదీకరింపఁ బడును.

మిక్కిలి యోగ్యులగు ఆచార్యుల ద్వారా యుపనయము గావింపవలసి యున్నది వారి లక్షణమిట్లు చెప్పబడినది.

"యస్మాద్ధర్మా నాచినోతిస ఆచార్యః॥" (ధర్మ సూత్రము) ధర్మోపదేశము శాస్త్రీయముగా నెవనివలన జరుగునో యతఁడే యాచార్యుడు బృహస్పతియు నిట్లు నుడువు చున్నాఁడు.

"ఆచినోతిచశాస్త్రాణి, ఆచారే స్థాపయత్యపి
స్వయమాచరతేయస్తు, తమాచార్యం ప్రచక్షతే."

వేదాది శాస్త్రములను సమగ్రముగా నెఱింగిన వాఁడును, శిష్యుని ఆచార వంతునిగా నొనర్చినవాఁడును, స్వయముగా ఆచారవంతుడునైనవాఁడాచార్యుఁడనఁబడును. యాజ్ఞవల్క్య మహర్షియు నిట్లు చెప్పుచున్నాఁడు.

"ఉపనీయ దదద్వేద మాచార్యః స ఉదాహృతః"

ద్విజ (బ్రాహ్మణ, క్షత్రియ: వైశ్య) బాలుఁద కుపనయము యధావిధిగాఁ గావించి వేదశిక్ష నొసంగినవాఁ డాచార్యుఁడనఁ బడును.

తండ్రి, తాత, పినతండ్రి, అన్న, జ్ఞాతి మొదలగువారు వరుసగా నొకరితరువాత నొకరు బాలుర కుపనయనము గావింపవలెను. తండ్రియేతప్పకవడుగుచేయువలెను. తండ్రిలేని పక్షమునఁ దాతయుఁ దాతలేని పక్షమునఁ బినతండ్రియుఁ నతడునుఁగూడ లేనుపక్షమున నన్నయు, నాతఁడు లేని పక్ష మున దాయాదులు నుపనయనము జేయుట కర్హులు. వీరిలో నెవరుగూడ వడుగు చేయుటకు యోగ్యతలేనివారైన నప్పుడు శౌనకమహర్షి యిట్లు వచించు చున్నాఁడు.

"కుమారస్యోపనయనం, శ్రుతాభిజనవృత్తవాన్
తపసాధూతనిశ్శేష, సాప్మాకుర్యాద్ద్విజోత్తమః

సద్వంశ జాతుడును, వేదశాస్త్ర విదుండును, తపః ప్రభావముచేతఁ బాపములఁ బోగొట్టుకొనిన వాఁడును, సదాచారసంపన్నుడును, నగుబ్రాహ్మణుఁడు ద్విజబాలకులకుపనయనముగావింపవచ్చును. ఇట్టి బ్రాహ్మణుని ద్వారా చేయఁబడు నుపనయన సంస్కారకార్య మెట్లు చేయవలయునో యావిధి సంగ్రహముగా నిటఁజూపఁబడుచున్నది.

ఉపనయనము జరుగుటకుఁ బూర్వదినమునందు యజమానుండును, నతనిసతియు, బాలునితోఁగూడ మంగళస్నానములఁజేసి తొలుత సంకల్ప మొనరించి గోదానముజేసి బ్రాహ్మణులద్వారా గాయత్రీజపమును జేయింపవలయును. తరువాత గణపతిపూజ, స్వస్తిపుణ్యాహ వాచనము మాతృకా పూజనము నాందీశ్రాద్ధాదులను యథావిధిగా జేయవలసియుండును. దాని తరువాత నుపనయన దినమున మొదటఁ బిల్లవానికి క్షౌరకర్మజేయించి స్నాన మొనరించిన పిదప యాచార్యుని సమీపమునకుఁ దీసికొనిపోవలయును అచట బ్రాహ్మణులద్వారా "ఆ బ్రహ్మన్" యీమొదలగు మంత్రములతో అశీర్వాదములు జరిగినతరువాత ఆచార్యుఁడు తనకుడివైపుననున్న బాలకునితో "బ్రహ్మచార్యస్యసాని" యీవాక్యమునుజెప్పించి స్వయముగా "ఓంయోగేంద్రీను. బృహస్పతిర్వాసః పర్వదధాదమృతం । తేన త్వాపదధామ్యాయుషే దీర్ఘాయుష్ట్వాయ బలా

యవర్చస్వీ యీమంత్రమును బఠించి వటువునకుఁ గటి(మొల) సూత్రమును, కౌపీనము (గోచి) ను, వస్త్రములను నియ్యవలసి యుండును. బ్రాహ్మణ బాలురకు జనపవస్త్రములను, క్షత్రియులకు అవిసె వస్త్రములను, వైశ్య వటువులకు ఉన్ని వస్త్రముల నొసంగవలెను. ఇట్టివస్త్రములే బ్రహ్మచర్యాశ్రమమందు ధరింపబడుచుండును. తరువాత ఆచమనము జేయించి యాచార్యుడు

"ఓం ఇయందురుక్తం పరిబాధమానా వర్ణంపవిత్రం పునతీమఆగాత్ ॥

యీ మొదలగు మంత్రములతో బ్రహ్మచారికెన్ని ప్రవరలుండునో యన్ని ముళ్లుగల ముంజిమొదలగు మేఖలను బ్రహ్మచారియొక్క కటిభాగమందు ప్రదక్షిణక్రమముగా మూడుమారులు చుట్టికట్టి తరువాత దేశాచారము ననుసరించి ఒక్కొక్క జత యజ్ఞోపవీత మొసంగి యన్నము మున్నగువానిని బెట్టి దక్షిణలతోఁగూడ నిరువదినాలుగు ఉదకపాత్రలను సంకల్పింపవలసినది. దీనితరువాత నీదిగువ చెప్పినచొప్పున యజ్ఞోపవీతసంస్కారము సల్పవలెను. తొలుత "ఆపోహిష్ఠామ" మొదలైన మూడు మంత్రములతో యజ్ఞోపవీతముపై ఉదకమునుజల్లి "బ్రహ్మజజ్ఞానం" యీమొదలగు మూడుమంత్రములను బఠించుచు దానిపై బొటనవ్రేలుద్రిప్పవలెను. తిరిగి తొమ్మిదితంతువు (పోగులు) లందును, ఓంకారాది తొమ్మండుగురు దేవతలను విన్యసించి యజ్ఞోపవీతమును గాంచుచు పదిమారులు "తత్సవితుః॥ మొదలగు గాయత్రీమంత్రమునుబఠింపవలసినది. మఱియునుపనయన

మంత్రమును జదివి సూర్యనారాయణ మూర్తికి యజ్ఞోపవీత మును జూపింపవలసినది. అప్పుడాచార్యులవారు తన చేతితో వటువునకా జందెము నొసంగవలెను. బాలకుఁడా యుపవీత మును దన చేతిలోఁ బెట్టుకొని

"ఓం యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతే
ర్యత్సహజం పురస్తాత్, ఆయుష్య మగ్ర్యంప్రతి
ముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥
యజ్ఞోపవీతమసి యజ్ఞస్యత్వా యజ్ఞోపవీతేనోపనేహ్యామి"

ఈ మంత్రము జదివి యజ్ఞోపవీతమును ధరింపవలసినది. అటు పిమ్మటచిత్రవిచిత్రవర్ణములుగల నూలువస్త్రమును"ఓం యువా సువాసః" అను మొదలగు మంత్రములు జదివి యజ్ఞోప వీతముతో సమానముగా బ్రహ్మచారి ధరింపవలసియుండును. అటుపిదప ఆచార్యుడు బ్రహ్మచారికి మీఁదఁ గప్పుకొనుటకై మృగచర్మ (లేడితోలు)ము నియ్యవలయును. మఱియు

"ఓం మిత్రస్య చక్షుర్వరుణం బలీయస్తేజో యశస్విస్థవిరం
సమిద్ధం అనాహతస్యం వసనం జరిష్ణుపరీదం
వాహ్యాజినం దధేహం॥"

ఈ మంత్రముతో బ్రాహ్మణాది బాలకులకు మృగాదుల చర్మములు ధరింపదగియున్నవి. అటుపిమ్మట ఆచార్యుఁడు బ్రహ్మచారికి బిల్వదండముగాని పలాశదండముగాని యిడ వలెను. ఈ బ్రహ్మచారులు "ఓం యోమేదండః" ఈమొదలగు

మంత్రములను జదివి యాచార్యుని హస్తమునుండి యా దండ మును గైకొనవలెను. దండము గ్రహించినతరువాత నాచార్యుఁడు తన దోసిలిని నీళ్ళతో నింపి బ్రహ్మచారి యంజలిని నాజలముతోడనే "ఆపోహిష్ఠామ" మొదలగుమూఁడుమంత్రములతో ముమ్మారు నింపవలయును. మఱియు నాచార్య పఠితమగు ప్రతిమంత్రముయొక్క యంతమునందు శిష్యుఁడు శ్రీసూర్యనారాయణమూర్తికిఁ దన యంజలియందుండు జలముతో మూఁడుమూరు లర్ఘ్యము లొసంగవలెను. అనంతరమునందు "సూర్య ముదీక్షస్వ" యని చెప్పి యాచార్యుఁడు శిష్యునకు సూర్యభగవానుని జూడుమని చెప్పవలెను. బ్రహ్మచారియు-

"ఓం తచ్చక్షుర్దేవహితం పురస్తాత్" యా మొదలగు మంత్రములను జదువుచు సూర్యనారాయణుని దర్శింపవలెను. అప్పుడాచార్యుఁడు శిష్యుని కుడిభుజముమీఁదుగాఁ జెయిచీసికొని పోవుచు—

"ఓం —మమవ్రతే తేహృదయం దధామి, మమచిత్త మనుచిత్తంతేఽస్తు మమ వాచ మేకమనాజుషస్వ బృహస్పతిష్ట్వా యునక్తు మహ్యా॥"

యా మంత్రముతో వటుని హృదయమును దాకవలెను. తిరిగి యాచార్యుఁడు బాలకుని కుడిచెయిని బొటన వ్రేలితోఁగూడఁ బట్టుకొని యిట్లడుగవలెను. "కో నామాసి"-యిందులకు బ్రహ్మచారి "అముకశర్మాహంభోః" అని ప్రత్యుత్తర మొసంగవలెను. ఇట్లే ముమ్మారాచార్య వటువులు పూర్వోక్త ప్రశ్నా

రముగాఁ బ్రశ్నోత్తరముల జరుపవలెను. మరల గురుఁడు శిష్యుని "కస్య బ్రహ్మచార్యసి" యని యడుగగా శిష్యుఁడు "భవతః" అని సమాధాన మిడవలెను. అప్పుడాచార్యుడు "ఓం ఇంద్రస్య బ్రహ్మచార్యస్యగ్నిరాచార్య స్తవాహ మాచార్యస్తవాసౌ" యీ మంత్రమును బఠింపవలెను. ఈ మంత్రముయొక్క చివరను "ఆచార్యస్తవ దేవ శర్మన్" యీ ప్రకారముగా "అసౌ" అను దాని స్థానమునందు శర్మపదముయొక్క యాద్యంతములందు బ్రహ్మచారి నామమును గ్రహింపవలెను పిమ్మట గురువు—

"ఓం ప్రజాపతయే త్వా పరిదదామి,
ఓం దేవాయ త్వా సవిత్రే పరిదదామి"

ఈ మొదలగు మంత్రములతో అంజలిబద్ధుడైయున్న బాలకునిఁ దూర్పు మొదలగు దిక్కులయందు ఉపస్థానము జేయించవలెను. మంత్రములను గురువు స్వయముగాఁ బఠింపవలెను. తరువాతఁ గుమారుఁ డగ్నికిఁ బ్రదక్షిణ క్రమముగాః బర్యుక్షణము గావించి యాచార్యునకు ఉత్తరపువైపునఁ గూర్చుండి పుష్ప చందన తాంబూలములను వస్త్రములను గైకొని "ఓం అద్య" యీ మున్నగు మంత్రములతో బ్రహ్మను వరించి పుష్పాదులను బ్రహ్మకు సమర్పింపవలసినది. బ్రహ్మయు బుష్పాదులను గ్రహించి "వృతోస్మి" యనవలెను. దీనితరువాత నుపనయన సంస్కార కార్యమం దనేక కృత్యములు జరుపబడును. ఇవి యన్నియు విస్తరభీతి నిట వ్రాయుట మానఁబడినది. ఈ సంస్కారమునకు సంబంధించిన గ్రంథములందవియన్నియు

జూడదగినవి. ఉపనయన సంస్కారము సమాప్తి బొందిన తరువాత నాచార్యుడు వటువును "నీవు బ్రహ్మచారివయితివి. ఇది మొదలుకొని వేదోక్త కర్మలను జేయుట కధికారివి. నీవు, స్నానము, సంధ్యోపాసనము, వేదాధ్యయనము, భిక్షాచర్య, యీ మొదలగు శాస్త్రోక్త కర్మలను జేయవలెను. నీవు పగటి పూట నిద్రపోరాదు. లోనగు నుపదేశముల నుపదేశింపవలెను బ్రహ్మచారియు, ప్రతిజ్ఞాపూర్వకముగా నా యుపదేశములను స్వీకరింపవలెను ఇది నియమము. దీనితరువాత నాచార్యుడు బ్రహ్మచారికి సావిత్రీ మంత్రోపదేశ మొనరించును. ఈ యుపదేశమునం దాచార్యుడు మొదటితడవలో ప్రణవవ్యాహృతి సహితముగా నొక్కొక్క పాదము నుపదేశించును. రెండవ తడవ నైన జెప్పినట్లు మొదటిబుక్కయొక్క యర్థభాగమునకు బ్రణవ వ్యాహృతులను జోడించి చెప్పించును. ఈ రెండవతడవలో నిదేప్రకారము మూడవ పాదమును బఠింపింపవలెను. తృతీయావృత్తిలో బ్రణవ వ్యాహృతులతో గూడ పూర్ణ మంత్రమును నుచ్చరింపించును. శిష్యుడా మంత్రముచు తోడ్తోడ జెప్పుచుండవలెను. ఇట్లు ముమ్మాఱు చెప్పించి యాచార్యుడు శిష్యుడును నిరువురు "ఓం స్వస్తి" యనవలెను. ఇటుపిమ్మట గొన్ని హోమాదులను గావింతురు. ఈ కృత్యము లన్నియు నిర్వర్తింపబడినపిమ్మట తొలుత బరమేశ్వరునకును, దేవతలకును, అగ్నిహోత్రునకును, సూర్యభగవానునకును నమస్కరించి తరువాత నాచార్యునకు, పిమ్మట వరుసగా దక్షిణ,

దండ్రికి మొదలగు పెద్దవారలకు, బూజ్యులకు నితర స్త్రీ పురుషులకును నమస్కరించుట విధి. దీనితరువాత భిక్షాపాత్రను గైకొని బ్రహ్మచారి బ్రాహ్మణుఁడైనచో "భవతి, భిక్షాం, దేహి" యనియు, క్షత్రియుడైనచో "భిక్షాం భవతి దేహి" యనియు వైశ్యుడైనచో "భిక్షాం దేహి భవతి" యనియు జెప్పుచు గృహస్థుల స్త్రీలనుండి భిక్షను గైకొనవలెను. మఱియు నట్టి భిక్షాపదార్థమును నాచార్యుని యెదుట నుంచి వారి యాజ్ఞానుసారము భుజింపవలెను. భోజనకాలమునుండి సూర్యాస్తమయమగువఱకు మౌనము వహింపవలెను. ఉపనయన సంస్కార సమయమందలి యగ్నిని మూడుదినములు. తప్పక దీప్తిగ నుంచవలెను. అది చల్లారిపోనీయఁదగదు. ఇదియంతయు నుపనయన విధియొక్క సంగ్రహము.

ఉపనయన సంస్కారము మిక్కిలి గూఢరహస్యమయమైనది. ఇందు బ్రహ్మజ్ఞానమునకు మూలస్వరూపమగు బ్రహ్మచర్య లాభము, యథార్థ జ్ఞానము, సదాచార లాభము, సుశిక్షాలాభము, ఆధ్యాత్మికోన్నతి పూర్ణ తత్త్వము నిండి యున్నవి. ఈవిషయమంతయు నీ దిగువ మిక్కిలి సంగ్రహించి చెప్పఁబడుచున్నది.

ఇందుఁ తొలుత అగ్ని, వాయు, సూర్య, చంద్ర, ఇంద్ర దేవతలనుండి సత్యవాక్సిద్ధులు, అధ్యయన సంపత్తులు, సదాచారము బొందుటకై ప్రార్థనయు. బ్రతిజ్ఞయుఁ జేయఁబడుచున్నది. పిమ్మట నాచార్యుఁడు వటువుపై దృష్టినిగుడ్చి

"ఓ పంచ దేవతలారా! మీరీ సుందర వటువును నాతోఁ గలుపుఁడు. మేమిరువురము విఘ్నములేకుండఁ బరస్పరము గలియ ననుగ్రహింపుఁడు. గురు శిష్య సమ్మేళనమే శిక్షకుఁ బ్రథమ ప్రధానానుష్ఠానమై యున్నది. ఇదే యీ విధానము నకుఁ గారణము. పిమ్మట మాణవకుఁ డాచార్యునితో నేను బ్రహ్మచారిని. అనఁగా మైథున రహితుఁడనుగా నున్నాను. నన్ను నుపనీతునిం జేయుఁడు. తమ సన్నిధికిఁ జేర్చికొనుఁడు" అని చెప్పవలెను. పిమ్మట నిరువురు దమతమ చేతులలోఁ దృప్తి సూచకమగు జలాంజలిని నింపికొని యాచార్యుఁడు శిష్యుని దనతోఁ గూడఁ గలుపుకొనుటకై కోరి యిద్దరుగూడ దోసిళ్ళ లోని తోయమును నొకచోట నేవిడిచి పెట్టవలెను. ఉదక మెట్లుద కముతోఁ గలిసిపోవునో యట్లే గురు శిష్యులుగూడఁ గలిసి పోయిరి. తిరిగి గురువు తన కుడిచేతితో శిష్యుని కుడిచేతిని బట్టుకొనును. శిష్యుఁడు తన హస్తమును జగత్ప్రసవితయగు సూర్యుఁడును: ఆరోగ్య విధాయకులగు అశ్వినీ కుమారులును, పోషణకారియగు పూషణదేవుఁడును తమ హస్తములలోఁ బట్టుకొన్నటులఁ దలంచును. దీనిఁబట్టి యీదశలో ఆచార్యుఁడే శిష్యునకుఁ దండ్రియు, వైద్యుఁడును, పోషకుండు నయ్యెనని స్పష్టమగుచున్నది. మరల గురువు అగ్నియు, సవితయు, అర్యముఁడును బ్రథమమునందే హస్తధారణ మొనరించి నిన్ను గ్రహించిరి. అగ్నిదేవుఁడే నీ యాచార్యుఁడు. నీవు నాకు మిక్కిలి ప్రియమును గల్గించు మిత్రుఁడవు. ఈ సమయమునందు

సూర్యుని యావర్తనమునకుఁ దగినట్లు నీవు నాకుఁ బ్రదక్షిణము జేయుము” అని చెప్పును. శిష్యుఁడాచార్యునకుఁ బ్రదక్షిణము జేసి యెప్పుడు కూర్చుండునో యప్పుడాచార్యుడు శిష్యుని నాభి (బొడ్డు)ని దాకి నిట్లు చెప్పును.

“ఓ **నాభీ!** నీవు స్థిరముగా నుండుము. ఓ అంతకా, ఈ బ్రహ్మచారిని నేను నీ కొప్పఁజెప్పుచున్నాను. (నాభి ప్రదేశముయొక్క పైభాగమును దాకి) ఓ వాయూ! (వామ భాగమును స్పృశించి) ఓ సూర్యుడా! (ఎదురు రొమ్మునుదాకి) ఓ అగ్నీ! (కుడిభాగమును స్పృశించి) ఓ ప్రజాపతీ! యితడు నావాఁడు. నేను మీ కొప్పగించుచున్నాను. ఇతనికి ముదిమి గాని, మరణముగాని, మరి యేదోషముగాని సంప్రాప్తింపఁ గూడదు” అని కోరును. పిదప **నాచార్యుఁడు** “నీవు బ్రహ్మ చారివైతివి. హోమముకొరకు సమిధల దీసికొనిరావలెను. మంత్రముల నుచ్చరించుచు నీరు త్రాగవలెను. గురుశుశ్రూష సలుపవలెను. పగటిపూట నిద్రపోకుము” యీ మొదలైనవాని నుపదేశించును. ఇవన్నియు బ్రహ్మచారి విధిగా జేయదగినవి. అనంతరమున బ్రహ్మచారి, యథార్థ బ్రహ్మచారి వేషమును ధరించును. అనగా శరీరమునకు వలయములు, మొదలగు భూషణములు త్యజించి మేఖల యజ్ఞోపవీతమును, అజినమును ధరించి గాయత్రీ మంత్ర పాఠమును గ్రహించును. గాయత్రీ పఠనానంతరము భిక్షాచర్య చేసి, భిక్షాన్నమును గురుపునకు

సమర్పించుటయు గురుని యాజ్ఞ ననుసరించి తాను భుజించు టయు మున్నగునవి కర్తవ్యములుగా విధింపఁబడినవి.

పైవిషయములన్నియు మిక్కిలి గూఢరహస్యమయములు. (1) జలములో జలము కలిసిపోయినట్లు గురుశిష్యుల మనుమయసమ్మేళనము మిక్కిలి మధురమై శిష్యునకు సర్వోన్నతిని గల్గించునదియై యున్నది.

(2) గురుడు శిష్యుని చేతిని బట్టికొనుట, కొనియాడఁదగిన జనకత్వ, స్వాస్థ్య, విధాయకత్వ, పోషకత్వముల పరిచయమును గల్గించుచున్నది.

(3) అయినను గురుఁడీ యధికారములనన్నిటిని బొంది యున్నప్పటికినిగూడ గర్వింపక శిష్యునకు అగ్ని దేవుడే యథార్థగురువనియు, మఱియు నతనికి బ్రియమిత్రుడు మాత్రమే తాననియు తలంచి స్పష్టీకరించెను. గురుని హృదయము శిష్యునిమీద తండ్రితో సమానము గాను, మైత్రియుక్తముగను, నిరభిమానముగను గలసి మెలగి యుండవలెను. ఇదే యిట ప్రకటమైనది. గురుని ఆ వర్తనమునందు లేక అనువర్తనమందు నుండుటయే శిష్యుని కర్తవ్యము. అది తత్కార్తృక సూర్యావర్తనముద్వారా ప్రకటితమైనది. ఎట్లు శిష్యుడు వేదోదయుడగు సూర్యునకు స్థానాపన్నుఁడయ్యెనో యట్లే గురుడుగూడ సూర్యుని యావర్తనీయ విశ్వమూర్తియగు పరమేశ్వరుని రూపముగా నున్నాడు. ఆ విశ్వరూపుఁడగు ... ం శిష్యుని శరీరములో విశ్వమును స్థాపించుటకొరకు కుద్య

మించి నాభి ప్రదేశమునందు యమధర్మరాజును, నాభి యొక్క పై భాగమునందు వాయువును, నాభి వామభాగమందు సూర్యుని, దానిమధ్యభాగమునం దగ్నిని, దక్షిణ భాగమందు ప్రజాపతిని స్థాపించెను. అనఁగా శిష్యుని దేహమంతయు బ్రహ్మదేహమయ్యెను. ఇట్లగుటవలననే యుపనయన సంస్కారము పూర్ణమయ్యెను. ఈసమయమందే మాణవకుఁడు పూర్ణ బ్రహ్మచారియై బ్రహ్మచారి వేషమును ధరించి శాస్త్రవిహిత మగు ననుష్ఠానమందుఁబ్రవర్తించెను. ఏ సంస్కారము నీచ దేహమును విశ్వదేహముగా మార్చి జీవుని శివునిగా జేయుటకు పరమ ప్రధాన సహాయక మగుచున్నదో, దాని మహిమ, దాని గొప్పతనము, దాని యనిర్వచనీయ రహస్యమును ఎంత మహత్తరమైనదో విజ్ఞులు గ్రహింపజాలుదురు.

## —*) యజ్ఞోపవీత రహస్యము (*—

యజ్ఞోపవీతనమునందుఁ దొమ్మిది పోఁగులు (నవతంతువులు)ను, మూఁడుముళ్లును నుండును. వీనియందుగూడ మిక్కిలి గూఢ తాత్పర్య మున్నది. ఎట్లన?

"ఓంకారః ప్రథమే తంతౌ, ద్వితీయేగ్ని స్తథైవచ
తృతీయే నాగదైవత్యం, చతుర్థే సోమదేవతా॥

పంచమే పితృదైవత్యం, షష్ఠేచైవ ప్రజాపతిః
సప్తమే మారుతశ్చైవ, అష్టమే సూర్యఏవచ
సర్వే దేవాస్తు నవమే, ఇత్యేతాస్తంతు దేవతాః

బ్రహ్మణోత్పాదితం సూత్రం విష్ణునాత్రిగుణీకృతం
రుద్రేణ దత్తో గ్రంథిర్వై సావిత్ర్యాచాభిమంత్రితం॥

యజ్ఞోపవీతమందలి తొమ్మిది పోఁగులలోఁ దొమ్మండుగురు దేవతల యధిష్ఠానము గలదు. ఆ తొమ్మండుగురు దేవతల తొమ్మిది వేలువేలు గుణములు గలిగిన యజ్ఞోపవీతమును ధరించుటవలన ద్విజబాలకుఁడు భూషితుఁడగును. మొదటిదేవత "ఓం"కారముయొక్క గుణము బ్రహ్మజ్ఞానము, రెండవ దేవత అగ్ని గుణము తేజస్సు, మూఁడవ దేవత యనంతుని గుణము స్థైర్యము, నాల్గవ దేవత చంద్రుని గుణము సర్వ ప్రియత్వము, ఐదవ దేవత పితృగణముయొక్క గుణము స్నేహ శీలత్వము, ఆఱవ దేవత ప్రజాపతి గుణము ప్రజారక్షణము, ఏడవ దేవత వాయువుయొక్క గుణము బలము, ఎనిమిదవ దేవత సూర్యుని గుణము ప్రకాశము, తొమ్మిదవ దేవత సర్వదేవతల గుణము సాత్వికత, యని యెఱుఁగవలెను. ఈ నవతంతువులతోఁగూడిన యజ్ఞోపవీతమును ధరించుటవలన నీ దేవతలందఱను నిత్యము స్మరించుటయు, వారి గుణములను దన హృదయమునందు నిల్పుకొనుటయు సంభవించును. నవతంతుధారణ మొనర్చుట కిదియే కారణము.

బ్రహ్మదేవుఁడు యజ్ఞసూత్రమును సృష్టించెను. విష్ణుమూర్తి దానిని మూఁడుపేట్లు గావించెను. రుద్రుఁడు ముడి వేసెను. సావిత్రీదేవి యభిమంత్రించెను. ముడి వేయునప్పుడు వీరి స్మరణమువలనఁగూడ శక్తిలాభము, జ్ఞానలాభము

గలుగును. యజ్ఞోపవీతముయొక్క పరిమాణము (కొలత) తొంబదాఱు (96) అంగుళములుండును దీని యర్థమేమనగా: మానవుని మానము (కొలత) ఎనుబదినాలుగు (84) అంగుళములును, దేవమానము తొంబదాఱు (96) అంగుళములగును. యజ్ఞోపవీతమును ధరించినతరువాత వేదవ్రతము, బ్రహ్మవ్రతము, మున్నగువాని ననుష్ఠించుటవలన మనుష్యునకు దేవత్వము, పిమ్మట తుదిదశయందు బ్రహ్మత్వమును ప్రాప్తించును ఈ భావమునే లక్ష్యమందుంచుకొని దేవమానముగల యజ్ఞోపవీతము చేయఁబడుచున్నది. ఇంతేగాక, కాయ (శరీర) దండ, వాగ్దండ, మనోదండము లనెడి దండత్రియమువలన, సంయమశుద్ధి (హింసాదులు లేకుండుట) చూపఁబడినది. శరీర సంయమముద్వారా బ్రహ్మచర్య ధారణము, తపస్సు, మున్నగునవియు, వాక్సంయమమువలన వదరుబోతుదనము, నసత్యవాదిత్వము నశించును. మనస్సంయమమువలన భోగాది విషయములనుండి మనస్సును మరలించియుండుట గలుగును. యజ్ఞోపవీతమును వేసికొనిన ద్విజుఁడైనవాని కెల్ల పై సంయమములు కర్తవ్యములు. ఉపనయన సంస్కారమువలన ద్విజులకిట్టి గొప్ప లాభము గల్గునని గ్రహింపవలసి యున్నది.

## -*) బ్రహ్మవ్రతము (*-

ఉపనయన మైనపిమ్మట గావించెడి తొమ్మిదవ సంస్కారమునకు బ్రహ్మవ్రతమని యందురు. ఇందు గురుని గృహమునందు శిష్యుఁడగు ద్విజుఁడు బ్రహ్మచర్య వ్రతమును

గ్రహించి బ్రహ్మ (పరమాత్మ)ను బొందు మార్గమునం దగ్రగామియై యుండుటకుఁ బ్రతిజ్ఞను గావించును. కనుకనే యీ సంస్కారమునకు బ్రహ్మవ్రతమని పేరు వచ్చినది. ఈ వ్రతమునందు బ్రహ్మచారికి గురుసేవ, బ్రహ్మచర్యమును నడుపుట కర్తవ్యములు. గురుసేవ లేకుండ నెట్టి విద్యయు ఫలింపదు, అందువలననే యార్యులు శాస్త్రములందు గురుసేవామహిమ నంత గొప్పగా వర్ణించిరి. ఎట్లన—

"ఆచార్యయోని మిహయే ప్రవిశ్య
భూత్వా గర్భే బ్రహ్మచర్యం చరంతి
ఇహైవ తే శాస్త్రకారాః భవంతి
విహాయ దేహం పరమం యాంతి సత్యం"

(సనత్సుజాతము)

ఎవరాచార్యుని సమీపమునకుఁబోయి వారిని సేవించి బ్రహ్మచర్య వ్రతమును బాలించుచున్నారో వారిహలోకమందు గొప్ప పండితులై మరణించిన మీదఁ బరమ పదమును బొందగలరు. మఱియు—

"శరీర మేతౌ కురుతః పితా మాతాచ భారత
ఆచార్య తస్తు యజ్జన్మ తత్సత్యం వై తథామృతం"

తలిదండ్రులు కేవలమొక స్థూలశరీరమునుమాత్రమే పుట్టింపఁ గలరు. కాని యాచార్యునివలననే యాధ్యాత్మిక దేహము పుట్టుచున్నదో యదే సత్యము, నమృతమునై యున్నది. శ్వేతాశ్వతరోపనిషత్తులోఁగూడ నిట్లు చెప్పఁబడినది:—

"యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥"

పరమాత్మయందెట్టి భక్తియుండునో యట్టి భక్తియే గురువు నందును గలవాని హృదయమునందు తత్వజ్ఞాన స్ఫురణము పుట్టగలదు. ఇట్లాచార్యుని చరణారవిందములందు లక్ష్యముంచి యే బ్రహ్మచర్యవ్రత మాచరింపఁబడుచున్నదో దానికి నాలుగు పాదములు గలవని శాస్త్రములందు వచింపఁబడినది. సనత్సుజాత గ్రంథమున:—

"శిష్యవృత్తి క్రమేణైవ, విద్యా మాప్నోతి యశ్శుచిః
బ్రహ్మచర్యవ్రతస్యాస్య ప్రథమః పాద ఉచ్యతే"

లోపల, వెలుపల శుచిత్వము గలిగి శుశ్రూష చేసి యే విద్య యార్జింపఁబడుచున్నదో యది బ్రహ్మవ్రతముయొక్క ప్రథమ పాదము—

"యథానిత్యం గురౌవృత్తిర్గురుపత్న్యాం తథాచరేత్
తత్పుత్రేచ తథాకుర్వన్ ద్వితీయః పాద ఉచ్యతే॥"

గురువుతో సమముగా గురుపత్నిని, గురుపుత్రునింగూడ శుశ్రూషించుట బ్రహ్మవ్రత ద్వితీయపాదము—

"ఆచార్యే ణాత్మకృతం విజానన్,
జ్ఞాత్వాచార్థం భావితోస్మీత్యనేన,
యన్మన్యతే తం ప్రతిహృష్ట బుద్ధిః,
సవైతృతీయో బ్రహ్మచర్యస్య పాదః॥"

ఆచార్యునిచేఁ దనకు గలిగిన యుపకారములను దెలిసికొని యతనివలన లభించిన వేదవిద్యతో దాను సత్కరింపఁబడిన వాఁడుగా దలఁచికొని హృదయమునం దే సంతోషమును, కృతార్థతను బొందుచున్నాఁడో అది బ్రహ్మవ్రత తృతీయ పాదమని తెలిసికొనవలెను.

"ఆచార్యాయ ప్రియం కుర్యాత్ ప్రాణైరపి ధనైరపి
కర్మణా మనసా వాచా చతుర్థః పాద ఉచ్యతే॥"

ధనము, మనము, ప్రాణము, వాణి, కర్మలవలన గురువునకుఁ బ్రియము గల్గించుటయే బ్రహ్మవ్రత చతుర్థపాదము. ఇట్లార్య ధర్మశాస్త్రములందు బ్రహ్మవ్రతముయొక్క నాల్గు పాదములు చూపఁబడినవి:—

మీఁదఁ జెప్పఁబడిన నాల్గు పాదములను బూర్తి చేయుటకు శాస్త్రములందు బ్రహ్మవ్రత సంస్కారమునందు ఉపనీతుఁడైన బ్రహ్మచారికి జేయఁదగిన యనేకోపదేశములు చేయబడినవి. ఇప్పుడవ్వానిలోనుండి కొన్ని యుపదేశము లీ దిగువఁ బ్రదర్శింపఁ బడుచున్నవి.

యమమహర్షి యిట్లు నుడువుచున్నాఁడు:—

"మేఖలా మజినం దండ, ముపవీతం చ సర్వదా
కౌపీనం కటిసూత్రంచ; బ్రహ్మచారీతు ధారయేత్
అగ్నీంధనం భైక్షచర్యామధశ్శయ్యాం గురోర్హితం
ఆసమావర్తనాత్కుర్యాత్ కృతోపనయనో ద్విజః"

ఉపనీతుఁడగు ద్విజుఁడు మేఖల, మృగచర్మము, దండము జందెము. గోచి, మౌంజినూలు, ఎల్లప్పుడు ధరింపవలెను. ఇట్లే సమావర్తన కాలపర్యంతము అగ్నిసేవ, భిక్షాచర్య, భూశయ్య గురువునకుఁ బ్రియమొనర్చుటయు చేయవలెను. మేఖలా కౌపీనాదులతో బ్రహ్మచర్యరక్షణము గాగలదు- శ్రీ మనుభగవానుఁడిట్లు వచించుచున్నాఁడు,—

"వేదయజ్ఞై రహీనానాం, ప్రశస్తానాం స్వకర్మసు
బ్రహ్మచర్యా హరేత్ భైక్షం, గృహేభ్యః ప్రయతోన్వహం॥"

వేదవిహిత యజ్ఞములందు భక్తిగలవారును, వర్ణాశ్రమములకుఁ దగిన కర్మముల ననుష్ఠించువారును, సదాచార సంపన్నులగు ద్విజుల గృహములందే బ్రహ్మచారి భిక్షాటన మొనర్పవలెను. యమమహర్షియు నిట్లు నుడివెను:—

"ఆహారమాత్రా దధికం, నక్వచిత్ భైక్షమాహరేత్
యుజ్యతే సహి దోషేణ, కామతోధిక మాహరన్॥"

తన యాహారమునకు దగినంతమాత్రమే భిక్షమెత్తవలెను. అంతకంటె నధికముగా నిచ్చవచ్చినట్లు భిక్షమెత్తిన బ్రహ్మచారికి దోషము సంభవించును. దక్షమహర్షి యిట్లు పలికెను.

"నధ్యాతవ్యం, నవక్తవ్యం, నశ్రోతవ్యం కథంచన
ఏతైస్సర్వైస్సునిష్ణాతో, యతిర్భవతి నాన్యథా॥"

బ్రహ్మచారికి స్త్రీలను గురించిన విషయము వినుటగాని, కనుట గాని, యనుటగాని, తలంచుటగాని కూడదు. ఇట్లు చేసినమోక్షల నతఁడు యతియగును. లేనిమోదలఁ గానేరఁడు

ఇవన్నియు సంక్షేపముగాఁ జెప్పఁబడిన బ్రహ్మవ్రత విధులు. వీని విశదీకరణము వేఱు గ్రంథములందుఁ జెప్పఁబడును.

## —*) వేదవ్రతము (*—

షోడశ సంస్కారములలోఁ బదవదానికి వేదవ్రతమని పేరు. దీనిని వేదారంభ సంస్కారమనియుఁ జెప్పెదరు. జ్యోతిష్యునిచేఁ జెప్పబడిన శుభదినమునందుఁ దన శాఖ నారంభించి యీ సంస్కారము నాచరించును. వశిష్టమహర్షి యిట్లు చెప్పుచున్నాఁడు:—

"పారం పర్యాగతో యేషాం, వేదస్స పరిబృంహణః
యచ్ఛాఖాకర్మ కుర్వీత, తచ్ఛాఖాధ్యయనం తథా॥"

ఏకులమందే శాఖ యే గృహ్యసూత్రము, ఏ వ్యవహార పరంపరతో వచ్చుచున్నదో యాకులమందా శాఖాగృహ్యసూత్రము తోడనే వేదారంభము గావలయును. పరాశర మహర్షి యిట్లు వచించుచున్నాడు:—

"వేదస్యాధ్యయనం సర్వం, ధర్మశాస్త్రస్య చైవహి
అజానతోర్థం తద్వ్యర్థం, తుషాణాం కండనం యథా॥"

వేదములను, వేదాంగములను, ధర్మశాస్త్రములను అర్థసహితముగాఁ జదువవలెను. అర్థము గ్రహింపకుండఁ గేవలము చదువుట ఊకదంపువలె నిష్ఫలము.

ఇప్పుడు వేదవ్రత సమయమునందు శాస్త్రములచేఁ జెప్పఁబడి చేయఁదగిన నిర్దేశములు (ఆజ్ఞలు) గొన్ని చూపఁ బడుచున్నవి. శాస్త్రములందు వేదపాఠమును, అర్థసహితమగు వేదాభ్యాసమును మిక్కిలి యెక్కువగాఁ బ్రశంసించి యున్నారు.

"వేద ఏవద్విజాతీనాం, నిశ్శ్రేయసకరః పరః
యం యం క్రతుమధీయీత, తస్యతస్యాప్నుయాత్ఫలం॥"
(యాజ్ఞవల్క్య మహర్షి)

ద్విజులకు వేదమే ముఖ్యమగు ముక్తిదాయక శాస్త్రము. ప్రతి శాఖను బఠించుటవలన నడ్డుపాటులేని లాభము పుట్టగలదు. స్మృతిసార సముచ్చయగ్రంథమునందిట్లు వ్రాయఁబడియున్నది.

వేదోయస్య శరీరస్థో న స పాపేన లిప్యతే
వేదాత్మా సతువిజ్ఞేయః శరీరైః కిం ప్రయోజనం॥
వేదాక్షరాణి యావంతి, పఠితాని ద్విజాతిభిః
తావంతి హరినామాని, కీర్తితాని నశంసయః॥
యస్య వేదశ్చ వేదీచ, విచ్ఛిద్యేతే త్రిపూరుషం
సవైదుర్బ్రాహ్మణో నామ, సర్వకర్మ బహిష్కృతః॥
నిత్యం నైమిత్తికం కామ్యం, యచ్చాన్యత్కర్మ వైదికం
అనధీతస్య విప్రస్య, సర్వం భవతి నిష్ఫలం—
అనధీతో ద్విజోయస్తు శాస్త్రాణి తు బహూన్యపి
శ్రుత్వా బ్రాహ్మణో ఘోరం నరకం స ప్రపద్యతే॥

నాధీత వేదో యో విప్రః ఆచారేభ్యః పరివర్తతే
నాచారః ఫల మాప్నోతి, యథాశూద్ర స్తథైవసః॥

ఎవని శరీరమునందు వేదమున్నదో వాని శరీరమును పాపము దాక నేరదు. అతఁడు వేదాత్మ. వాని శరీరమువలన ఫలమేమి? వేదమం దెన్ని యక్షరముల నా ద్విజుఁడు పఠించునో యన్ని హరినామములను గీర్తించిన వాఁడగును. ఇందు సందియము లేదు. ఏవంశమందు మూఁడుపురుషాంతరములవఱకు వేదపాఠ మురాదో, వేదవిదుఁడు నుండడో యతఁడు కర్మహీనుండగు కుబ్రాహ్మణుండనియు, నతని వంశము కుబ్రాహ్మణ వంశ మనియు నెఱుఁగవలెను. వేద స్వాధ్యాయములేని బ్రాహ్మణుని నిత్య, నైమిత్తిక, కామ్య, సర్వకర్మములు నిష్ఫలంబులగును. ఏ ద్విజుఁడైనను పెక్కు శాస్త్రములను జదివినప్పటికిని వేద స్వాధ్యాయము గావింపనియెడల నతఁ డధోగతినే చెందును. వేద పాఠము జేయక ఆచారసంపన్నుఁడైనను ఫలము బొందఁ జాలఁడు. అతఁడు శూద్రప్రాయుఁడగును. ఇట్లార్షశాస్త్రము లందు వేదపాఠ మహిమ యద్భుతముగా వర్ణింపఁబడినది.

మనుసంహిత నాల్గవ యధ్యాయమునందును, మరి యితర సంహితలందును వేదపాఠము జేయఁగూడని దినములు జూపింపఁబడినవి.

"ప్రతిపత్సు, చతుర్దశ్యా, మష్టమ్యాం పర్వణోర్ద్వయోః
శ్వో నధ్యాయేద్య శర్వర్యాం, నాధీయీత కదాచన॥"

శుక్లకృష్ణ ప్రతిపత్తులు, చతుర్దశులు, అష్టములు, రెండు పర్వ ముల యందును (పూర్ణిమామావాస్యలు) ఈ దినములయందు వేదపాఠము జేయఁగూడదు. ఏదిన మనధ్యాయము గావలసి యున్నదో దానికి పూర్వదిన రాత్రికాలమం దెప్పుడుగూడ వేద పాఠము గావింపఁగూడదు.

ఈ విధికిఁదోడు కొంత యపవాదవిధిగూడ నున్నది.

"నైత్యకే నాస్త్యనధ్యాయః సంధ్యోపాసన ఏవచ
ఉపాకర్మణి కర్మాంతే, హోమమంత్రేషు చైవహి॥
అనధ్యాయస్తునాంగేషు, నేతిహాస పురాణయోః
న ధర్మశాస్త్రేష్వన్యేషు పర్వాణ్యేతాని వర్జయేత్॥
అధీయీత సదా సర్వాం బ్రహ్మవిద్యాం సమాహితః
సావిత్రీం శతరుద్రీయం వేదాంతాశ్చ విశేషతః॥

(కూర్మపురాణం)

నిత్యకర్మలో, సంధ్యోపాసనము, ఉపాకర్మ, హోమమంత్ర పాఠము వీనియం దనధ్యాయము లేదు. మఱియు, వేదాంగ ములు, ఇతిహాసములు, పురాణములు, ధర్మశాస్త్రములు, వీని పఠనమునకు గూడ ననధ్యయనములేదు. ఇతరత్ర పైనఁజెప్పఁ బడిన పర్వదినములయం దనధ్యాయ మున్నది. బ్రహ్మవిద్యయు వేదాంతము, గాయత్రి, శతరుద్రీయ పాఠము, వీనియందు గూడ ననధ్యాయము లేదు. ఇది యనధ్యాయప్రకరణమం దప వాద విధి. ఇట్లు వేదాది శాస్త్రముల యాజ్ఞ ననుసరించి వేద

వ్రతమనెడి సంస్కారమును సంపూర్ణముగా నెరవేర్చినపిమ్మట బ్రహ్మచారి వేదవిద్యయు, సకలశాస్త్ర పారంగతుడును, ఐహికాముష్మికములందు గల్యాణము గల్గించెడి యధికారియు గాగలడు.

శాస్త్రములం దనధ్యాయములన్ని పరిగణించుట యెందులకో దానియొక్క వైజ్ఞానిక పద్ధతిని విచారించినయెడల సాధారణముగా మూడు హేతువులు గన్పట్టుచున్నవి. ఎట్లనగా —

(1) చంద్రాది గ్రహోపగ్రహముల యాకర్షణము.
(2) ఉత్తమాధమ శకునములు.
(3) శారీరక, మానసికాశుచిత్వము.

వేదము భగవద్వాక్యమైనందువలన, ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికములందుగల వివిధ శక్తులు వేదమంత్రములందు సంపూర్ణముగా నున్నవి. అందువలన దేశ కాలములు, గాని, స్వాధ్యాయము గావించెడి శారీరక, మానసిక స్థితి గాని, అతని కనుకూలముగా నెంతవఱకుండదో యంతవరకును వేదపాఠము స్వరాదులతో హస్తచాలనాదులతో వేదమంత్రముల నుచ్చరించుటచేత, ననేక ప్రకారములుగల యాధివ్యాధులును, దైవిక విపత్తులును గలుగవచ్చును. ఈ కారణమును బట్టియే యార్యశాస్త్రములందు పైన జెప్పినట్లు వేదపాఠ నిషేధము చూపఁబడినది.

(1) అష్టమి, పూర్ణిమ, అమావాస్య, వీని పూర్వాపర తిథులలో సూర్యచంద్రాది గ్రహముల యాకర్షణము, దానివలన గలిగెడి శారీరక, మానసిక ప్రతికూలతయు బ్రత్యక్ష సిద్ధములు.

(2) కుక్క, నక్క, గాడిద, ఏనుగ, మున్నగు జంతువులతో నపశకునముల విశేష సంబంధము శకునశాస్త్రమునందు విశదీకరింపఁ బడినది. ఆ సంబంధమువలనఁ గలుగు దైవిక విపత్తులుగూడ మనుష్యుల కందఱకు సంభవించుటకూడ శాస్త్రసిద్ధమై యున్నది.

(3) రాహుగ్రస్త, కేతుగ్రస్త, సూర్య చంద్రోపరాగములవలన గలిగిన సూతకము, ప్రేత శ్రాద్ధము మున్నగు వానియందు భుజించినందువలన సంభవించు తపోనాశము, అశుచిత్వమును, కృతఘ్నులయు, పాపిష్ఠులయు, నింక నితర దోషులయు సమీపమున నున్నందువలన వచ్చు అపవిత్రత, ఇట్టిట్టివన్నియు శారీరక, మానసికములగు అశుచిత్వమునకు దృష్టాంతములు. ఆ హేతువునుబట్టి ఇట్టి యాధిభౌతికాధి దైవిక బాధలన్నిటి భయమువలన వివిధవిధ శక్తులతో నిండియున్న వైదికమంత్రముల యుచ్చారణము గావించుట హానికారకమగుట చేత శాస్త్రములం దనధ్యాయములు విధింపఁ బడినవి. వేదాంతాది శాస్త్రములతో ఆధ్యాత్మిక సంబంధముయొక్క ప్రధానతయు, దైవీశక్తి సంపర్కముయొక్క న్యూనతయు నుండుటచేత వాని స్వాధ్యాయమందలి స్వాధ్యాయానధ్యాయ

ములు విధిః షేశముకింత యెక్కువగాఁ బరిగణింపబడి యుండ లేదు. ఇదే యనర్ధ్యాయము లవియని నిర్దేశించుటకు మూలమైన వైజ్ఞానిక నిర్ణయము.

—*) సమావర్తనము (*—

పదునొకండవ సంస్కారమునకు సమావర్తనమని పేరు. గురుని గృహమున విద్యముగించినపిమ్మట గృహస్థాశ్రమ మందుఁ బ్రవేశించుటకు గృహమునకు మరలివచ్చు సమయ మందు సమావర్తనమనెడి సంస్కారమును సలుపుకొనవలసి యుండును. వేదములో—

"ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య,
ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః" (అనియున్నది)

ఆచార్యునికోరిక ననుసరించి దక్షిణా రూపముగా ధనమును సమర్పించి ప్రజాతంతువును రక్షించుటకు స్నాతకుండగు ద్విజుఁడు గృహస్థాశ్రమమందుఁ బ్రవేశింపవలయును ఏ విద్య యాచార్యునివలన వచ్చినదో దాని పరిశోధనము ధనము ద్వారా కాఁజాలదు. హారీతమహర్షి యెట్లు నుడువుచున్నాడో కనుఁడు—

"ఏకమప్యక్షరం యస్తు, గురుశ్శిష్యే నియోజయేత్
పృథివ్యాం నాస్తి తద్ద్రవ్యం, యద్దత్వాప్యనృణీ భవేత్॥"

ఆచార్యుఁడొక యక్షరమైనను శిష్యున కిచ్చినను బ్రపంచములో దానితో సమానమగు ధనమేదియు లేదు. కాఁబట్టి శిష్యుఁడేది

యిచ్చినను గురునకు అనృణి (ఋణరహితుఁడు) గాఁజాలఁడు. అట్లయినప్పటికి లోకమర్యాద ననుసరించి బ్రహ్మచర్య వ్రతము సమాప్తి యైనట్లు గురుదక్షిణ సమర్పింపవలసి నట్లాజ్ఞాపింపఁబడి యున్నది. కూర్మ పురాణమునం దిట్లున్నది.

వేదాన్ వేదాంస్తథా వేదౌ, వేదం వాపి సమాహితః
అధీత్య చాధి గమ్యార్థం, తతస్స్నాయా ద్ద్విజోత్తమః

శ్రద్ధల చిత్తుఁడై నాలుగు వేదములో, మూఁడు వేదములో, రెండు వేదములో, ద్విజులకొక వేదమైన జదివి దానియందలి గురైరుంగఁదగిన మంచి విషయములను దెలిసికొని పిమ్మట సమావర్తన స్నానము చేయవలయును. యాజ్ఞవల్క్య మహర్షి యిట్లు వచించుచున్నాఁడు

వేదవ్రతాని వా పారం, నీత్వా హ్యుభయమేవవా
అవిప్లుత బ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియముద్వహేత్

-*) వివాహము (*-

పండ్రెండవది వివాహసంస్కారము. దీనివిషయము మఱియొక సారి విస్తారముగాఁజెప్ప బడును. అయినను సందర్భానుసార ముగా సంగ్రహించి యిది జెప్పఁబడుచున్నది.

వివాహసంస్కారమునం దే యే వైదిక క్రియలు గావింపఁబడు చున్నవో వివిపి స్తరించి యిటనుంచుట నిష్ప్రయోజనముగా గనుపడఁగలదు. అందువలన నా పనిని మాని యందు చేయుచున్న భావములు మాత్రము వర్ణింపఁబడుచున్నవి. ఆభావములపై

నిలకడగా చిత్తముంచి విచారించిన ప్రతి మనుష్యుఁడును అన్య దేశీయుల వివాహపద్ధతికిని, ఆర్యజాతీయుల వివాహపద్ధతికిని ఆకాశ, పాతాళములకున్నంత తారతమ్యముగలదని తెలిసి కొనఁగలఁడు. అనఁగా అన్యదేశీయుల వివాహము కేవలము స్థూలములగు ఇంద్రియముల సేవకొరకు స్త్రీపురుషుల స్వల్ప కాలము నిలిచియుండు లౌకిక సంబంధము మాత్రమే యైయు న్నది. ఇక ఆర్యజాతీయుల వివాహమన్ననో దంపతుల ఆత్మ మనస్సు, ప్రాణము, శరీరములకు పరస్పరము ప్రబలమైన ఆధ్యాత్మిక సంబంధముద్వారా యిరువురకు మోక్షలాభ ములుగలిగించు బహుకాలము నిలిచియుండు ప్రయత్నమై యున్నది. అన్యదేశీయ వివాహపద్ధతి దృష్టాంతరూపముగా నొకింత చూపబడుచున్నది.

(1) ఒక ఆసనముమీఁద కూర్చుండి యొకపాత్రములో స్త్రీ పురుషులు భుజించినంత మాత్రముననే వారిని బ్రహ్మ (బర్మా) దేశీయులగు జనులు భార్యాభర్తలనుగా గణించి స్వీకరింతురు, ఒక నిమ్మపండునో, మఱియొక పండునోకోసి దాని సగము భాగము పురుషుడు స్త్రీముఖమునందును, మిగత సగమును స్త్రీ పురుషునిముఖమునందును బెట్టి తినిపించినయెడల. వారిద్దరకు వివాహమైనట్లు చీనావారును జపానువారును నంగీకరించు చున్నారు.

(2) తురకలలోఁగూడ నొక ఆసనముపైఁగూర్చుండి యొక పాత్రలో స్త్రీపురుషులొకరి నొకరు భోజ్యపదార్థములను

భుజింపజేసిన మొదల నప్పు దేవారికి పెండ్లిజరిగినట్లు భావింతురు. కాని మహమ్మదీయులయందు కన్యలయొప్పుదలయే వివాహము నకు మూలమంత్రమైయున్నది.

(3) క్రిస్టియనులయందుగూడ స్త్రీ పురుషుల యొప్పుదల, పురోహితుని మంత్రపఠనము, ఒకరిముఖముతో నొకరిముఖము నుంచుట, యిటువంటి పనులమూలముననే వైవాహిక సంబంధము సంపూర్ణమైనట్లు ప్రకటింపఁబడుచున్నది. దీనింబట్టి స్త్రీ పురుషులు పరస్పరము ఎంగిలి తినుట యనెడి యొక క్షుద్ర వ్యాపారమే విజాతీయుల వివాహమునకు ప్రధానాంగముగా పరిగణింపఁబడుచున్నదని తేలుచున్నది. ఇఁక దీనికిని మన యార్య జాతీయుల దివ్యవివాహవిధికిని ధార్మిక ప్రపంచము నందెంత గొప్ప భేదమున్నదో యావిషయ మీదిగువ చూచాయగా వ్రాసినందువలననే సులభముగా తెల్లమగుచున్నది.

సనాతన ధర్మీయుల వివాహములందు జలము అగ్ని, యీ రెంటి సంబంధము విశేషముగా నుండును మొట్టమొదట వరునియొక్కయు వధువుయొక్కయు చేతులకలిపి శంఖముతో నెడతెగని నీటిధార పోయవలయుననెడి విధి యున్నది చేతులద్వారా విద్యుత్ప్రవాహము (ఎలెక్ట్రిసిటి) ప్రసరించు నుండును. ఇందులకు ప్రమాణమిదివరకే చూపఁబడినది. ఉదకము విద్యుత్తునకుమిక్కిలిగొప్పసంచాలకమైయున్నది. ఇది యువిజ్ఞాన (సైన్సు) ప్రపంచమందు ప్రసిద్ధమైనవిషయమే. శంఖముతో నాదమునకు, మోక్షమునకు సంబంధమున్నది. ఇదిగూడ నిదివఱకే

చెప్పబడినది. ఇందువలన ఈనీటి కారపోయుటయందు భార్యా భర్తల ప్రేమధారా వినిమయ(మార్గ)మును, బొందుటకును ప్రేమయొక్క విద్యుచ్ఛక్తి దృఢీకరించుకొనుటకును మిక్కిలి సహాయము గాగలదు. మరియు శంఖరూపియగు మోక్షము యొక్క సంబంధముండుటచేత, దాంపత్యప్రేమ, భోగవిలాసములందే పర్యవసింపక తుదియందు భగవంతుని ప్రేమను పుట్టింపఁగలదు. దంపతులు గృహస్థధర్మములను నెరవేర్చుచు చివరను మోక్షమిచ్చెడి నివృత్తి మార్గమునకు అధికారులు గాగలరు. వివాహ పద్ధతియందీ తత్త్వమే తేలుచున్నది. ఆకారములేనిదియు, శక్తి విహీనమైనదియునగు ఏవస్తువునైనను బాగుచేసి ఆకారమిచ్చి దృఢముగా జేయుటకు జలాగ్నుల సాహాయ్యము దీసికొనఁబడుచున్నది. దృష్టాంతరూపముగా బోధింపబడుచున్నది: మట్టియొక్క పరమాణువులను నీళ్లతో నానబెట్టి మొదట కుండ మాదిరిగాఁ జేసి తరువాత ఆ పచ్చికుండను అగ్నియందు బాగుగా గాచినచే గట్టికుండయగును. బలహీనమగు మట్టిలోనుండి గట్టి ఇటుక, ముంత, కుండ, బాన మొదలగు పెక్కురకముల పాత్రలనన్నిటిని జేయుటకుగూడ నిదే పద్ధతి. కనుక నెడబాసిన వస్తువులకు సంబంధము గల్గించి, ఆ సంబంధమును గట్టిగాను, స్థిరముగాను జేయవలెనన్న నది జలాగ్నుల సాహాయ్యముతోడనే చక్కగా సంభవించును. వివాహయజ్ఞానమందుగూడ భార్యా భర్తల సంబంధము మిక్కిలి దృఢముగాను, జన్మజన్మాంతరములందును స్థిరముగా నుండుటకును నిదే కారణమైనందువలన ఈ

జలాగ్నుల సంబంధమింత గొప్పగా బరిగణింపఁబడినది. ఇది గాక బ్రాహ్మణుఁడు దేవతలలో అగ్నిదేవుని సమీపమున సాక్షిరూపముగా సంకల్పము మున్నగువానిని జేయించుటకును, వరుణ(జలాధిదేవత) దేవునినుండి యనుగ్రహలాభముఁబొందుట కును గూడ నేదోయొక కొంత యదృష్టఫలమై యున్నది.

వివాహసంస్కారమునందు ఇతర కృత్యములయిన పిమ్మట కన్యాదానము జేయు సంకల్ప సమయమందు సమస్త దేవతలనుండి యాశీర్వాదమును గైకొని వివాహకార్యము శుభభావమయముగా నొనర్పబడును. ఎట్లన.

బ్రహ్మా వేదపతిః, శివః పశుపతిః, సూర్యోగ్రహాణాంపతిః
శక్రోదేవపతిర్వహ్ని ర్హుతపతిః, స్కంధశ్చ సేనాపతిః
విష్ణుర్యజ్ఞపతిర్యమః పితృపతిశ్శక్తిః పతీనాంపతిః
సర్వేతే పతయస్సుమేరు సహితాః కుర్వంతు వోమంగళం

ఇట్లు శుభసూచకముగా బ్రహ్మాదిదేవతల నామోచ్చారణ మైనతరువాత దశమహాదానములం జేయవలెను. ఈ దానముల యందు మిక్కిలి పవిత్రతయు, ఆస్తికతయుగలదు. సువర్ణదాన మం దెట్టి విశేషమున్నదో కనుఁడు:—

"హిరణ్యగర్భ సంభూతం, సౌవర్ణం చాంగుళీయకం
సర్వప్రదం ప్రయచ్ఛామి, ప్రీణాతు కమలాపతిః"

ఈ దానము విష్ణుప్రీతికొరకై యున్నది. దీనితరువాత గోదానము.

"యజ్ఞ సాధన భూతాయా, విశ్వస్యాఘౌఘ నాశినీ
విశ్వరూప ధరో దేవః ప్రీయతా మనయా గవా"

గోమాత యజ్ఞమునకు సాధన రూపిణియు, సంసార పాప నాశనియు నై యున్నది. ఈ గోదానమువలన విశ్వరూపధారి యగు దేవత ప్రీతి యగుచున్నది. పిమ్మట భూదానము.

సర్వేషా మాశ్రయా దేవి, వరాహేణ సముద్ధృతా
అనంత సస్యఫలదా, అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥

వసుమతియగు భూమి వరాహావతార మెత్తిన భగవంతునిచే నెత్తబడినది. సకలజీవుల కాశ్రయమైనది. అనంత సస్య ఫలముల నిచ్చునది. భూదానముద్వారా దేవినుండి శాంతి గోర బడును. ఇదే వివాహవిధి యాదలి దానవిధు లన్నింటియొక్క మాహాత్మ్యమై యున్నది. పిమ్మట వధూవరులొక యాసనము పైఁ గూర్చుండి యిరువురుగలిసి యాజ్యహోమము జేయు సమయమందు పఠించెడి మంత్రములందుఁగూడ గొప్ప పవిత్ర భావములున్నవి.

(1) దేవతలలో శ్రేష్ఠుఁడైన యగ్ని దేవు డిక్కడకు వచ్చుగాక! అతఁడీ కన్యకు భవిష్యత్తునందు గలుగు సంతాన ము మృత్యు భయమునుండి తప్పించుగాక! అవరణ దేవతలు ఈ స్త్రీ పుత్రసంబంధమైన వ్యసనముతో బీడింపఁబడకుండు నట్లు ఆజ్ఞాపింతురుగాక!

(2) గార్హపత్యమనెడి అగ్ని, యీ వధువును రక్షించు చుండునుగాక! దీని పుత్రుఁడు ముసలితనముపరకు జీవించుగాక!

ఈ స్త్రీ జీవితులగు పుత్రులు గలదియై భర్తతోఁగూడ నివసించు గాక! మరియు సత్పుత్రులవలనఁ గలుగు సంతోషము ననుభవించునుగాక!

(3) ఓ కన్యా! ద్యులోకము నీపృష్ఠభాగమును రక్షించు గాక! వాయువును, అశ్వినీకుమారులు నీ రెండు తొడలను గాపాడుదురుగాక! సూర్యభగవానుఁడు నీ చనుబాలు ద్రాగు పుత్రులను సంరక్షించుగాక! ఈ మొదలగునవి.

ఈ ప్రకారముగా ఆజ్యాహుతు లైనతరువాత లాజా (వరి పేలాలు) హుతులు చేయఁబడును. వీనియందు వధూ పక్షమున, వరునకు శతాయువు (నూరేండ్లు ఆయుస్సు) గలుగు నట్లును, వరుని వక్షమున భిన్నముగాని దాంపత్య ప్రేమ గలుగు నట్లును ప్రార్థనలున్నవి. లాజాహుతులతోఁబాటు లౌకిక కథను జెప్పవలసినవిధి గలదు. ఇదిగూడ రససంభరితమై యుండును. ఎట్లనః—

"రాఘవేంద్రే యథా సీతా, వినతా కశ్యపే యథా
పావకేచ యథా స్వాహా, తథాత్వం మయిభర్తరి॥
సుదక్షిణా దిలీపేచ, వసుదేవేచ దేవకీ
లోపాముద్రా యథాగస్త్యే, తథాత్వం మయిభర్తరి॥
అత్రౌ యథానసూయాచ, జమదగ్నౌచ రేణుకా
శ్రీకృష్ణే రుక్మిణీ యద్వత్తథాత్వం మయిభర్తరి॥" ఇత్యాది.

ఏ ప్రకారముగా రామునింగురించి సీతయు, కశ్యపునిం గూర్చివినతయు, అగ్నినింగూర్చి స్వాహాదేవియు, దిలీపునిం

గూర్చి సుదక్షిణయు, వసుదేవునిగూర్చి దేవకీదేవియు, అగస్త్యునిగూర్చి లోపాముద్రయు, అత్రినిగూర్చి అనసూయయును, జమదగ్నిగూర్చి రేణుకయు, మరియు శ్రీకృష్ణునింగూర్చి రుక్మిణీదేవియు పవిత్ర భావమును, ప్రేమను జూపిరో యట్టి పవిత్ర భావమే, యట్టి మధుర దాంపత్య ప్రేమయే యీ వధూవరులయందుఁ గలుగుటకై యీ ప్రార్థన.

లాజాహుతి సమాప్తి యైనపిదప "సప్తపది" గమనము సాగింపఁబడును. పతి యొక్కొక్క వాక్యమును జెప్పుచుండ సతి యొక్కొక్క అడుగు పెట్టుచు నేదో కొంత చెప్పును. ఈ వాక్యము లన్నియు ఈదిగువ నుదహరింపఁ బడుచున్నవి. వరుఁడు చెప్పవలసిన వాక్యములివి.

"ఓం ఏకమిషే విష్ణుస్త్వా నయతు,
ఓం ద్వే ఊర్జే విష్ణు స్త్వా నయతు
ఓం త్రీణి రాయస్పోషాయ విష్ణు స్త్వా నయతు
ఓం చత్వారి మాయోభవాయ విష్ణుస్త్వా నయతు
ఓం పంచపశుభ్యో విష్ణు స్త్వా నయతు
ఓం షడృతుభ్యో విష్ణుస్త్వా నయతు
ఓం సఖే సప్తపదా భవ సా మా మనువ్రతా
భవ విష్ణు స్త్వా నయతు॥ "

ఓ కన్యా! విష్ణుమూర్తి, యన్నలాభమున కొక పదము, బల లాభమునకు రెండవ పదము, పంచమహా యజ్ఞములు మున్నగు నిత్యకర్మల కొరకు మూడవ పదము, సౌఖ్యమునకై నాలుగవ

పదము, పశులాభముకొరకు ఐదవ పదము, ధనరక్షణకై యాఱవ పదము. ఋత్విక్కుల లాభమునకై యేడవ పదమును బెట్టించును. ఈ సమయమందు సతి యొక్కొక్క అడుగు బెట్టుచు నొక్కొక్క శ్లోకమును పఠించును.

"ధనం ధాన్యంచ మిష్టాన్నం, వ్యంజనాద్యం చ యద్గృహే
మదధీనం చ కర్తవ్యం వధూరాద్యే పదే వదేత్॥
కుటుంబం రక్షయిష్యామి, సదా తే మంజుభాషిణీ
దుఃఖే ధీరా సుఖేహృష్టా, ద్వితీయే సా బ్రవీద్వచః,
పతిభక్తిరతా నిత్యం, క్రీడిష్యామి త్వయాసహ
త్వదన్యం న నరం మంస్యే తృతీయే సా బ్రవీదిదం॥
లాలయామి చ కేశాన్తం గంధమాల్యాను లేపనైః
కాంచనై ర్భూషణైస్తుభ్యం తురీయే సా పదే వదేత్॥
ఆర్తే ఆర్తా భవిష్యామి, సుఖదుఃఖ విభాగినీ
తవాజ్ఞాం పాలయిష్యామి, పంచమే సా పదే వదేత్॥
యజ్ఞే హోమే చ దానాదౌ, భవిష్యామి త్వయాసహ
ధర్మార్థ కామకార్యేషు వధూః షష్ఠే పదే వదేత్॥
అత్రాంశే న క్షిణో దేవాః మనోభావ ప్రబోధినః
వంచనం న కరిష్యామి సప్తమే సా పదే వదేత్॥

ఇంటిలోని ధనము, ధాన్యము, వ్యంజనము మొదలగునవి నా యధీనమునందుండవలెను. నేను మధుర భాషిణిని, కుటుంబ రక్షణిని, దుఃఖమునందు ధీరను, సుఖమునందు సంతుష్టను,

గాగలను. పతివ్రతనై నీవెంబడి విహరింపగలను. నిన్ను విడిచి యితర పురుషుని మనస్సునగూడ దలపను. గంధ, మాల్యాభరణాదుల ద్వారా నిన్నెల్లప్పుడాదరించుచుందును. నీదుఃఖమునందు దుఃఖమును, సుఖమునందు సుఖమును, బంచుకొందును. నీ యాజ్ఞకు బద్ధురాల నగుదును. యజ్ఞ, హోమ, దానాదుల యందు మరియు ధర్మార్థ కామములకు సంబంధించిన సర్వ కార్యములందును నీకు సాధనభూతగా నుందును ఈ నాప్రతిజ్ఞ యందు అంతర్యాములగు దేవతలందఱు సాక్షులు. నిన్నెప్పుడు మోసగింపను. ఇవన్నియు సప్తపదీగమన సమయమందు స్త్రీ పక్షమున గావించు ప్రతిజ్ఞలు. దీనిద్వారా వధువు తన గోత్రమును మార్చుకొని పెనిమిటి గోత్రమునకే చెందును. మరియు వివాహ సంబంధము ధృఢమగును. కేవల మొక గోత్రము మారుటయే కాదు. డాక్టరులు (వైద్యులు) పరీక్షించి చూచినయెడల వధువు శరీరమందలి రక్తముగూడ భావము ననుసరించి మారినదై యా పెనిమిటి రక్తమునకు దగినట్లుండు నని తెలియగలదు. ఈ సప్తపదీ గమనమైన తరువాత వరుని వలన వధువుయొక్క శిరముపై జరుపబడు అభిషేకము: వధువు ద్వారా జరుగు ధ్రువదర్శన మైనపిమ్మట వరుడు వధువు యొక్క కుడిభుజము మీదుగా జేయి దీసికొని—

"ఓం మమవ్రతే తే హృదయం దధామి
మమచిత్త మనుచిత్తంతే స్తు
మమ వాచ మేకమనాజుషస్వ
ప్రజాపతిస్త్వా నియునక్తు మహ్యం॥"

నీ హృదయము నాకోరికయందు జేర్చుము. నీ చిత్తమును నా చిత్తము ననుసరించునట్లు జేయుము నీవు నా మనస్సులో నీ మనస్సును జేర్చి నామాటను నెరవేర్పుము. బృహస్పతి నన్ను ప్రసన్నునిగా జేయుటయందు నిన్ను బ్రవర్తింప జేయుగాక! ఈ మంత్రమును జదివి వధూ హృదయమును దాకవలయును. పిమ్మట వధువును జూచుచు —

"ఓం సుమంగలీ రియం వధూ రిమాం స మేత పశ్యత
సౌభాగ్య మస్యై దత్వా యథా స్తం విపరేతన॥

ఈ మంత్రమును బఠింపవలెను. అనంతరము దేశాచారాను సారముగా వధువును వరుని యెడమ తొడపై గూర్చుండబెట్ట వలెను. పిమ్మట వరుని వామాంగముమీద గూరుచుండిన వధువు ఏడు శ్లోకములతో ప్రతిజ్ఞ గావించును.

తీర్థవ్రతో ద్యాపన యజ్ఞదానం
మయాసహత్వం యది కిన్న కుర్యాః
వామాంగ మాయామి తదాత్వదీయం
జగాదవాక్యం ప్రథమం కుమారీ॥
హవ్య ప్రదానై రమరాన్ పితౄంశ్చ
కవ్యప్రదానై ర్యది పూజయేథాః
వామాంగ మాయామి తదా త్వదీయం
జగాద కన్యా వచనం ద్వితీయం॥
కుటుంబరక్షా భరణే యదిత్వం
కుర్యాః పశూనాం పరిపాలనంచ

వామాంగ మాయామి తదాత్వదీయం
జగాద కన్యా వచనం తృతీయం॥ ఇత్యాది.

నేను తీర్థము, వ్రతము, ఉద్యాపనము, యజ్ఞము, దానము మొదలైన సమస్త ధర్మ కార్యములందును మీ యెడమ శరీర భాగముగా నుండగలను. హవ్యమిచ్చుటలో దేవపూజను, కవ్యమిచ్చుటలో పితృపూజను నెరవేర్చుటయందు మీకు వామాంగినిగా నుందును. కుటుంబరక్షణ మందును, పశుపాలనము నందును మఱియు నిట్టి సర్వకార్యములందును మీ వామాంగ రూపిణిగా నుండెదను. ఇట్టిఇట్టి శపథములను గావించినపిమ్మట వరుఁడా ప్రతిజ్ఞల నొప్పుకొనుచు నిట్లు చెప్పును.

"ఏదీయ చిత్తానుగతం, చ చిత్తం
సదా మదాజ్ఞా పరిపాలనంచ
పతివ్రతా ధర్మపరాయణాత్వం
కుర్యా స్సదా సర్వమిమం ప్రయత్నం"

నీవు పాతివ్రత్య ధర్మమునందాసక్తురాలవై యెల్లప్పుడు నాయందు చిత్తముగలదానవు కమ్ము. నా యాజ్ఞను నెరవేర్చుచు నా ప్రతిజ్ఞకు దగిన కార్యమును జేయుటయందు శ్రద్ధగలదానవుకమ్ము. ఈ ప్రకారముగా ప్రతిజ్ఞ గావించిన పిదప "ఓం వామ ముద్యసహితరావ్రసుమశ్చో" యీ మొదలగు మంత్రములను బఠించుచు వరుఁడు వధువుయొక్క పాపటకొనను సిందూరమును బెట్టవలెను. దీనితరువాత గొన్ని మాంగలిక కార్యములైనపిమ్మట వివాహ సంస్కారము సమాప్తము

గాఁగలదు. ఇదంతయు ఇహలోక పరలోకములందును నిశ్శ్రేయస లాభములు గలుగునంతవరకును ధర్మజీవనలాభము గలిగించుటకు సర్వోత్తమ కారణరూపమైన వివాహ సంస్కారముయొక్క మిక్కిలి పవిత్రమైనదియు, నిగూఢమైనదియు నగు రహస్యమని యెఱుంగవలెను. ఈ విషయమును గూర్చి సామాన్యముగానైన విచారించిన వివేకశీలుఁడగు మనుష్యుఁడు ఆర్యజాతియందలి వివాహ విధికిని, ఇతర జాతియందలి వివాహవిధికిని నెంత యంతరమున్నదియు మరియు నెంత గొప్ప లక్ష్యమును నెదుటనుంచుకొని పూజ్యపాదులగు మహర్షులు వివాహ సంస్కార విధిని బ్రవర్తింపఁజేసిన సంగతియు నెఱుంగఁగలరు.

మనువు మొదలగు స్మృతిశాస్త్రకర్తలు బ్రాహ్మము, దైవము ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము ఈ ఎనిమిది విధములైన వివాహములను జూపి మొదటి నాలుగు విధముల వివాహములను బ్రశంసించి తరువాతి నాల్గు వివాహములను నిందించిరి.

—*) అష్టవిధ వివాహ లక్షణములు (*—

(1) వస్త్రాభరణాదులతో కన్యను నలంకరించి సత్ప్రవర్తనము, వైదుష్యము గల వరుని బిలిచి యతనికి దానమొసంగుట బ్రాహ్మ వివాహము.

(2) యజ్ఞమునందుండి కార్యము నిర్వహించెడి ఋత్విక్కునకు అలంకరింపబడిన కన్యను దీసికొనిపోయి దాన మిచ్చుట దైవ వివాహము.

(3) ధర్మమునుబట్టి వరునిపక్షమునుండి యొక గోమిథునమును గ్రహించి యథావిధిగా కన్యాదానము చేయుట ఆర్ష వివాహము.

(4) వధూవరు లిరువురచే ధర్మ మాచరింపవలెననెడి నిర్ణయము చేయించి తండ్రి కన్యాదాన మొనర్చుట ప్రాజాపత్య వివాహము.

(5) వరుడు కన్యకను జ్ఞాతులకును యథాశక్తిగా ధన మొసంగి పెండ్లిచేసికొనుట, ఆసుర వివాహము.

(6) స్త్రీపురుషు లిరువురును యథేచ్ఛగా బరస్పరము ప్రేమించుకొని పెండ్లిచేసికొనుట గాంధర్వ వివాహము.

(7) తిట్టియో, కొట్టియో, నెట్టియో, అదరించియో, బెదరించియో, స్వజన గృహమునుండి తప్పించియో, యేడ్పుచుండగా, కోపించుచుండగా బలాత్కారముగా కన్య నెత్తుకొని పోయి పెండ్లాడుట రాక్షస వివాహము.

(8) నిద్రించి యుండగనో, త్రాగి యుండగనో, మూర్ఛిల్లి యుండగనో పిల్లను వివాహమాడుట పైశాచ మనం బడును.

ఇప్పుడు కాలపరిభావమువలన నితర వివాహ పద్ధతులు తగ్గి కేవలము బ్రాహ్మవివాహ పద్ధతియే యెక్కువగా

నాచరింపఁ బడుచున్నట్లు కన్పడుచున్నది. ఇంక నక్కడక్కడ గొన్ని కొన్ని స్థానములం దాసుర వివాహరీతి యున్నప్పటికి గూడ నది ప్రశంసింపఁబడక నిందింపఁబడుచున్నది. మను, కశ్యపాది మహర్షులీ యాసుర వివాహమును మిక్కిలి నిందించి యున్నారు ఎట్లనః—

"క్రయక్రీతాతుయా నారీ, న సా పత్న్యభిధీయతే
న సా దైవే న సా పిత్ర్యే, దాసీ తాం కవయో విదుః"
(కశ్యపుఁడు)

డబ్బిచ్చి కొనఁబడిన స్త్రీ, "పత్ని" యని చెప్పుటకుఁ దగదు. ఆస్త్రీ దైవకార్యమందుగాని పితృకార్యమునందుగాని పాల్గొనుటకు దగదు ఆ స్త్రీని దాసి యని విజ్ఞులు వ్యవహరింతురు. మఱియు

"కన్యా విక్రయిణో మూర్ఖాః, రహః కిల్బిష కారిణః
పతంతి నరకే ఘోరే, దహన్త్యాసప్తమం కులం"

పిల్లను విక్రయించుకొన్న జనులు, మూర్ఖులును, రహస్యముగా పాపముజేయు దుష్టులు నై యున్నారు. వీరికి ఘోర నరకము గలుగును. వీరి ఏడుకులములదాక నుండువారును దగ్ధము గాగలరు. ఇట్లు శాస్త్రములం దాసుర వివాహపద్ధతి యధికముగా నిందింపఁబడి యున్నది. ఇఁక రాక్షస, పైశాచ వివాహ నిందావిషయ మార్యశాస్త్రములకు స్వతస్సిద్ధమే కదా. కాని యిన్ని యున్నప్పటికిగూడ "నాభావో విద్యతే సతః" వస్తుసత్త నశింపక కేవలము రూపాంతరముమాత్ర మగుచున్న

దనెడి ఈ సిద్ధాంతము ననుసరించి గౌణరూపముగా బ్రాహ్మ
వివాహ పద్ధతిలోఁగూడ దేశాచారము, లోకాచారము, కులా
చారములను బట్టి ఇతర వివాహ పద్ధతులయొక్క కొన్ని కొన్ని
లక్షణములు సైతము జూపట్టుచున్నవి. నేటి కాలమందు జరుపఁ
బడు వివాహములలో ఋత్విక్కునిం బూజించినట్లు వరపూజా
విధి గావింప బడుచున్నది. దీనివలన బ్రాహ్మ వివాహమునందు
దైవవివాహ పద్ధతిగూడఁ బ్రవేశించి యున్నట్లు చెప్పవచ్చును.
బ్రాహ్మ వివాహమందలి యర్ఘ్య విషయమునందు "వివాహ
స్థానమునందు గోవును కట్టియుంచెడి యాజ్ఞ యున్నందువలన"
ఆర్ష వివాహలక్షణము గోచరించుచున్నది. ఇట్లే మోటుమాటల
పరిహాసములు, తిట్లు, అలకలు, అవమానములు, తగవులు
లోనగునవి రాక్షస వివాహ లక్షణములును, దంపతులు
పరస్పరము చక్కగా చూచుకొనుట, స్త్రీల వేడుకలు,
జాగరణము చేయుట. ఆమోదము, ప్రమోదము, మున్నగునవి
గాంధర్వ వివాహ లక్షణములును, తండ్రి పిల్లకొఱకై పిల్లవాని
నుండి సొమ్ములు, చీరలు మొదలగునవి తీసికొనగోరుట ఆసుర
వివాహ లక్షణమును, ఇట్లే యితర వివాహలక్షణములు నెట్లో
గన్పట్టుచునేయున్నవి. బ్రాహ్మవివాహమే సర్వోత్తమమైనది.
ఈ బ్రాహ్మవివాహ సంస్కారమందలి యపూర్వ రహస్యము
లును, గొప్పతనమును, లాభములును గొలదిగా జూపఁబడి
ఇందువలన సర్వవిధములను బ్రాహ్మవివాహమే సర్వోత్తమ
మైనదని గుర్తెరుంగ వలెను.

## —*) అగ్న్యాధానము (*—

పదమూడవ సంస్కారమునకు "అగ్న్యాధాన" మని పేరు. ఇందు పురుషుఁడు భార్యా సహితుఁడై ప్రాతస్సాయం కాలములందు శ్రౌతాగ్ని యందో, స్మార్తాగ్ని యందో హోమించు విధిగలదు. హోమ, సంస్కార, యజ్ఞాదులగు నిత్యానుష్ఠానముల ద్వారా "బ్రాహ్మీయం క్రియతే తనుః" అనఁగా "ఈ శరీరము బ్రహ్మబోధ కనుకూలమైన గుణములతో గూడుకొనిన దగును." యని మొదటనే వచింపఁబడినది. అగ్ని పరమ పవిత్రుఁడును, ఊర్ధ్వశిఖల గలవాఁడును, దేవతలలో బ్రాహ్మణుడునై యున్నాడు. కాబట్టి యగ్నిని సేవించినందు వలన "బ్రాహ్మీతను" ప్రాప్తికి విశేషమగు వీలుండుటంబట్టి యార్యశాస్త్రములందు ద్విజులు భార్యాసహితముగా ఆయగ్ని పరిచర్య చేయవలెయుననెడి విధి విధించబడినది. అగ్ని పరమ పవిత్రము ను, తేజోమయమునై యున్నది.

ఇట్లు వివాహమైనపిమ్మట కామినీ సంసర్గముచే విషయ వ్యాపారము ప్రబలమై యాధ్యాత్మిక విషయమునం దధోగతి జెందుటకు అవకాశములుగూడ నధికమగును. ఇందు వలన నా కామినితోఁబాటు తేజోమయుండగు అగ్ని భగవానుని సేవ, సంబంధము పూజయు ధర్మశాస్త్రములం దాజ్ఞాపింపఁ బడినవి. దీనింబట్టి విషయ సంబంధమువలన విషయేచ్ఛ హెచ్చక ప్రవృత్తి నశించుటచే దినక్రమమున నివృత్తి సంస్కారమే ప్రబల మగును. ప్రవృత్తి మార్గమునందు

ధనసంపత్తి, అన్నము, సంతానము, శక్తి, సుఖము, స్వాస్థ్యము వీర్యము మొదలగునవి క్షేమముగా వశ్యములగును. ఈసమస్త వస్తువులను సంపాదించుటయందు దేవతానుగ్రహము కోరవలసి యుండును. శ్రీ భగవద్గీత యిట్లు చెప్పుచున్నది:—

"ఇష్టాన్ భోగాన్ హి వో దేవాః
దాస్యన్తే యజ్ఞభావితాః"

యజ్ఞముద్వారా యభివృద్ధి బొందిన దేవతలు, గృహస్థాశ్రమ నిర్వాహ మనాయాసముగా గావించుటకై కోరఁబడిన భోగముల నొసంగగలరు. శాస్త్రమందు "అగ్నిముఖా వై దేవాః" అనఁగా అగ్నియే సర్వదేవతల ముఖమై యున్నది. అగ్నియం దాహుతి గావించుటచేతనే ఆ యాహుతి దేవతలకు చేరి మేఘము, వర్షము, అన్నము, ప్రజ మున్నగువాని సంపత్తుల యుత్పత్తులకు కారణము గాగలదు. మను భగవానుఁడుగూడ:

"అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే
ఆదిత్యాజ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః"

అనఁగా అగ్నియందు వేల్చబడిన ఆహుతి, సూర్యునియందుఁ జేరి యతనినుండి వాన, వానలవలన అన్నము, అన్నమువలన జనులు జనింపగలరు. ఇట్లు చెప్పి "అగ్నిముఖా వై దేవాః" అనెడి సిద్ధాంతమును బలపరచెను. అందువలన "అగ్న్యాధాన" సంస్కారముతోబాటు ప్రవృత్తి మార్గములో మంచి పద్ధతియు, నివృత్తి మార్గమునకు పోషకత్వమును, నిశ్శ్రేయస

పరంపరకు సంబంధము నుండుటవలన వివాహానంతరమే యీ సంస్కార విధానము విధింపఁబడినది.

—*) దీక్షా, మహావ్రతములు (*—

పదునాల్గవ సంస్కారమునకు "దీక్ష" యనియు, పదునైదవ సంస్కారమునకు "మహావ్రత" మనియు నామములు. గృహస్థాశ్రమమందలి నిత్య, నైమిత్తిక కర్మ, భావశుద్ధిపూర్వక విషయసేవ, పత్నీ సహితముగాఁ జేయు అగ్ని పరిచర్యల ద్వారా ప్రవృత్తి సంస్కార మెంతెంత యంతరించుచుఁ బోవుచుండునో యంతమాత్రమే గృహస్థుని చిత్తమందు మోక్షేచ్ఛ యుదయించుట, నివృత్తి మార్గముపై గోరిక, పరమాత్మపై భావమును, హెచ్చ మొదలిడును. అట్టి సమయమందొక సద్గురువు ప్రకృతిని, ప్రవృత్తిని, అధికారమును గుర్తెరింగి "దీక్ష" నిడవలసిన యావశ్యకత తప్పక కలుగును. దీనివలన సాధకుఁడు క్రమముగా నివృత్తి మార్గమందు బాటసారియై నిత్యానందమయమైన బ్రహ్మరాజ్యమునందుఁ బ్రవేశింపఁగలడు. ఈ కారణమువలన అగ్న్యాధానమైన తరువాతనే దీక్ష యను పేరుగల సంస్కారముయొక్క విధాన మార్యశాస్త్రములందుఁ జేయఁబడినది. గురుదేవుఁడు కరుణించి శిష్యునకు దేవతా మంత్రములను ఉపదేశించు కార్యమునకే దీక్షయని చెప్పెదరు. దీక్షయైన కొంతకాలమునకు పిమ్మట సాధకునకు వానప్రస్థాశ్రమాధికారముగల్గినప్పుడు "మహావ్రత" సంస్కారమును, దాని కనుకూలమైన సాధనములను నుపదేశింప

బడును. ఈ రెండు సంస్కారములవలననే మలవిక్షేపములను నిర్మూలించుటయందు విశేషమైన యవకాశముండును. ఇట్టి దీక్షా, మహావ్రతముల లాభమును బొంది యాధ్యాత్మిక రాజ్యమునందు ముందడుగువేసి యగ్రేసరుఁ డగుచు నగుచు నంతమందు సాధకుఁ డెప్పుడు నివృత్తియందు పరాకాష్ఠ గలిగి యోగారూఢ పదవియందు నిలిచియుండునో యప్పుడే ఆవరణమును నశింపఁజేయు పదునారవ (తుది) సంస్కారమైన సన్న్యాసమున కధికారమును వాడు బొందగలడు. దీక్షా, మహావ్రత నియమములన్నియు సాధన సంబంధములు గలవగు టచే మిక్కిలి గూఢముగా నుంచఁదగినవియు, సద్గురు ముఖము వలననే తెలిసికొనఁ దగినవియు నై యున్నవి. ఇందువలన నింతకంటె నెక్కువగా నిచ్చట ముచ్చటింపలేదు.



—*) సన్న్యాసము (*—

పదునాఱవ (తుది) సంస్కారమునకు "సన్న్యాస" మని పేరు. శ్రుతియం దిట్లున్నది:—

"పుత్రైషణా యా విత్తైషణా యా లోకైషణా యా
వ్యుత్థా యా థ భిక్షాచర్యం చరంతి"

సంతానాదివాసన, సంపత్తికామన, యశోభిలాషలు సమూల ముగా నశించిన తరువాత సాధకునకు సన్న్యాసాశ్రమ స్వీకా రమునకు యోగ్యత గలుగును షోడశ సంస్కారములలో మొదటి తొమ్మిది సంస్కారములు ప్రవృత్తిరోధకములనియు,

రెండవ యొనిమిది, నివృత్తి పోషకములనియు దొలుత నే చెప్పఁ బడినది. నివృత్తి పోషకత్వముయొక్క పరాకాష్ఠయందే సన్న్యాస మున్నది. ఎట్లనఁ—

"న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకేమృతత్వ మానశుః"

సకామకర్మ, సంతానోత్పత్తి, ధనములద్వారా అమృతపదము రాదు. కాని త్యాగము వలననే సాధకు లనేకులు అమృత పదమును బొందిరి. సన్న్యాస సిద్ధియందే యీ యమృతపద ప్రాప్తి యగును. అదెట్లనగా? భగవంతుఁడు గీతలో నిట్లు చెప్పుచున్నాఁడు.—

"లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణ కల్మషాః
ఛిన్న ద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః"

(౫ వ అధ్యాయము)

పుణ్య సంస్కారము లభివృద్ధి యైనకొలఁది పాపసంస్కారములు క్షీణించుచుండును. ఇంద్రియములను, మనస్సును సంయమించుట వలన నంతఃకరణము, ఆత్మయందు పూర్తిగా లీనము గాగలదు. భూతములయొక్క కల్యాణమునం దాసక్తి యుండుటచేత స్వార్థనాశనమును, ఔదార్య వృద్ధియు గల్గును. మఱియు జీవసేవా రూపముగా వ్యాపకుండగు బ్రహ్మను బూజించుటవలన అంతఃకరణముగూడఁ బరాత్పరునియందు నిలిచిపోగలదు, ఈ ప్రకారముగా హృదయమందలి ద్వైధా

భావము నశింపగా అద్వైతమునందు సాధకుఁడెపుడు చిరప్రతి
ష్ఠితుఁడగునో యప్పుడే యతఁడు యోగారూఢుడును,
జీవన్ముక్తుఁడును, మహాత్ముఁడునై బ్రహ్మ నిర్వాణపద లాభ
మును నందుకొనఁగలడు. ఇదే శ్రీకృష్ణుఁడు భగవద్గీతలో
నుపదేశించినది. సన్న్యాస దశయందు అవాఙ్మానసగోచరమును
అవ్యక్తమును, అనిర్వచనీయమును, నిర్గుణమును, నిరాకారమును
దేశకాల వస్తు పరిచ్ఛిన్నంబును, సర్వత్రా వ్యాప్తమునగు
బ్రహ్మము యొక్క ఉపాసనయే రాజయోగమని యెఱుఁగ
వలెను. మఱియు ఉపాస్య, ఉపాసక భావములను నొక్కటిగా
జేయుటవలన జ్ఞానాజ్ఞాన హేయమయమగు త్రిపుటియొక్క
లయ సాధనముద్వారా నిర్వికల్ప సమాధియందు క్రమముగా
స్థితి గలుగును. అది యెట్లు సంభవించునని ప్రశ్నమునకు
సమాధానముగా గీతయందీ రహస్యము బండ్రెండవ యధ్యా
యములో వర్ణింపఁబడి యున్నది. ఎట్లన.—

"యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం, పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యంచ, కూటస్థ మచలం ధ్రువం
సన్నియమ్యేంద్రియ గ్రామం, సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ, సర్వభూత హితేరతాః"

ఏ సాధకులు నిర్దేశింపరానిదియు, చింతింప దగనిదియు, సర్వ
వ్యాపకంబును అవ్యక్తంబును, కూటస్థంబును, నిశ్చలమును,
ధ్రువమును, అక్షరమును నైన బ్రహ్మము నుపాసింతురో వారు
గూడ నా పరమాత్మనే పొందుదురు. కాని యతనిని బొందుట

కొఱకై విశేషముగా నింద్రియ నిగ్రహమును, చిత్తవృత్తి నిరోధము, నెల్లెడల సమబుద్ధి, సకల జీవముల హితమునం దాసక్తియును ఆవశ్యకములై యుండును ఉపాసన (యోగము) ద్వారా ఇంద్రియ నిరోధము, చిత్తవృత్తి నిరోధమును గలుగును. జ్ఞానమువలన సమబుద్ధి గలుగును. నిష్కామకర్మ యోగమువలన భూతసేవయు, బ్రహ్మపూజయు లభించును. అందువలన గర్మోపాసనా జ్ఞానముల నెడిమూడింటికిదగినట్లుగా నొనర్పు ప్రయోగమువలననే నిర్గుణబ్రహ్మోపలబ్ధి నిర్వికల్పపదవి యందు ఆత్యంతిక స్థితియు, శివపద ప్రాప్తియు శ్రీభగవద్వచనా నుసారముగా సిద్ధింపఁగలదు. ఇదే సన్న్యాసాశ్రమ సంస్కారము యొక్క చరమలక్ష్యమును, మనుష్య జీవనమునకుగూడ బరమ లక్ష్యమునై యున్నది సన్న్యాసవిషయ మింకను నితరగ్రంథము లందు జెప్పఁబడును. ఇదే యార్యశాస్త్రములం దుపదేశింప బడిన షోడశ సంస్కార మహిమ.

ఇట్టి యనేకాద్భుత లాభప్రదములగు షోడశ సంస్కారములను తత్తదుచిత కాలములందు యథావిధిగా జేసి యైహికాముష్మిక సుఖంబులందుట పుణ్యభూమియందు జనించిన ధార్మికు లగు మీకు విధి యని విశ్వసింతురుగాక!

సంపూర్ణము.

[illegible]

# దివ్యవాణీ సుకృతి ప్రసాదము

1. వేద వేదాంగ చంద్రిక సుస్మృతి 140 పుటలు రూ॥ 1-0-0
2. దర్శనదర్పణము ,, 125 ,, 1-4-0
3. పురాణములు ,, 260 ,, 2-0-0
4. శ్రాద్ధము లెందుకు పెట్టవలె 0-8-0
5. నమస్తే మీమాంస 0-2-0
6. దయానంద కా కచ్చాచిట్ఠా 0-2-0
7. స్వరాజ్యము-సనాతనధర్మము 0-4-0
8. దేశసేవ-సనాతనధర్మము 0-4-0
9. షోడశ సంస్కారములు 0-12-0

## దివ్యవాణీ విజయ సంచికలు

ప్రథమ విజయ సంచిక 1-8-0
ద్వితీయ ,, 0-8-0
తృతీయ ,, 0-8-0
చతుర్థ ,, 1-0-0
పంచమ ,, 1-0-0

దివ్యవాణీ పత్రికకు సం॥ 3-8-0 చందా చెల్లించి చందాదారులుగానున్నవారికి విజయసంచికలు సగముధరకే ఇవ్వబడును. కొలదిప్రతులే కలవు. త్వరపడుడు.

శ్రీరామా బుక్ డిపో సోల్ ఏజన్సీ
మార్కెటు స్ట్రీటు, సికిందరాబాదు.